# ముందుమాట

అనంత విశ్వంలో ప్రతిజీవీ ఏదో ఒక ఆశయంకోసం కృషి చేయక తప్పదు. ఆశయాన్ని నమ్మి కృషి చేయడం మానవ లక్షణం. అట్టి అమూల్య సూత్రాన్ని నమ్మి నా యీ చిన్ని నవలను పాఠకుల కందించ సాహసించాను. మస్తిష్కం మహోన్నత పరిణామాల జనింప చేస్తుందికదా! వచ్చిన ఆలోచనలను వృథా పోనీయక కలాన్ని తీసికొన్నాను.

భాషాజ్ఞానం సరిగాలేదు. వ్రాసేది క్రమ పద్ధతిలో సాగుతుందో, లేదో కూడ తెలియదు. కలం పట్టటం యిదే తొలిసారి. ఈ పరిస్థితులవల్ల యీ నవలలో అనేక తప్పులుండవచ్చు. మరొక దృష్టితో చూడక సహృదయులైన పాఠకులు నా యీ ప్రథమ రచనను ఆదరించి ప్రోత్సాహమిస్తారని ఆశించుచున్నాను.

ఆర్థిక పరిస్థితులలో ఆదుకుని, పుస్తకము అచ్చు అవ్వడమే ముఖ్యమని తలచి, నన్ను ప్రోత్సహించిన మా వూరి (పెదముత్తేవి) సహృదయులకు, నా ఆత్మీయులకు, తమపనిగా చూచుకొని తీవ్రకృషి సలిపిన ముముక్షువు ముద్రణాలయాధినేతలకు, నాకు సర్వవిధాల సహకరించిన శ్రీ ముత్తేవి లక్ష్మణదాసుగారికీ, ప్రేమచూపి పరిచయం వ్రాసిన శ్రీ వల్లభనేని కాశీవిశ్వనాథంగారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతాభివందనము లర్పిస్తున్నాను.

తన పనిగా చూచుకొని, సర్వవిధముల కృషిసల్పి నవల నీ రూపానికి తీసుకు రావడంలో సమగ్ర భారాన్ని వహించిన నా మిత్రుడు వేమూరు దుర్గాప్రసాద్ శర్మకు నా కృతజ్ఞత.

ఇట్లు,
మీ,
లింగమనేని.

పెదముత్తేవి
24—5—'60

# పరిచయము

"రక్తసంబంధం" అన్న ఈ చిన్ని నవలను రచించిన చిరంజీవి లింగమనేని సుబ్బారావు ఉత్సాహం, ఉద్వేగం మెచ్చుకో తగినవి. ఈ పుస్తకం అచ్చు కావడానికి చేయి నందించిన వారందరినీ చిరంజీవితో పాటు అభినందిస్తున్నాను.

ఒక రచన ఆలోచనలో సాధించి, వ్రాతలో కూర్చి – అచ్చు రూపాన చూసుకోవాలని పొందే తహ తహ అనుభవైకవేద్యం. అది నేను కొంతకు కొంత ఎరుగుదును. ఆ అచ్చైన గ్రంథం నలుగురూ చదివి, ఆనందించి ప్రశంసించినపుడు కలిగే ఆనందం అంతా యింతా కాదు.

ప్రపంచంలో రక్త సంబంధాలు అనేకం కారణాంతరాలవల్ల తెగిపోవడం, అందులో కొన్ని తిరిగి అనుసంధింపబడడం జరుగుతూనే వుంటవి. అయితే ప్రేమ సంబంధంగా, వివాహ రూపాన ఆ రక్తసంబంధం ఏదైనా తిరిగి అనుసంధింపబడితే సంబంధ మున్నవారికీ, లేనివారికీ ఎంతో ఆనందాన్నిస్తుంది.

సామాన్య లోక విషయాన్ని ఇతివృత్తంగా తీసుకొని కొన్ని సంఘటనలు కల్పించి చిన్న నవలగా రూపొందించాడు చిరంజీవి. భాష మధురంగా వున్నది. వర్ణనలు కళాత్మకంగా వున్నవి. కథ చర చర నడిచి పోయింది. అయితే అనుభవంతో కథాగమనం, భాషారూపం క్రమంగా స్థిరతనందుకుంటాయి. నలుగురూ చదివి ఆనందించ తగిన పుస్తకమిది.

ఇదే రీతిని కవితా వ్యవసాయం విడవక సాగిస్తూ విలువైన బంగారు పంటలు పండించి రచయితయగు చిరంజీవి లింగమనేని సుబ్బారావు నలుగురికీ అందీయగలడనీ, ఆనంద మీయగలడనీ ఆశిస్తున్నాను. చిరంజీవిని హృదయ పూర్వకంగా దీవిస్తున్నాను.

ఏలూరు,
24—5—1960.

వల్లభనేని కాశీవిశ్వనాథం,
ప్రజా ప్రచురణలు.

౧

ఆ రోజు దీపావళి. వినూత్న కాంతులతో విరాజిల్లే దీపావళి. అంధకారాన్ని పారద్రోలి పసిడికాంతుల నుద్భవింపజేసే నూత్నదీపావళి. అనంతజగత్తులో అందరికీ ఆనందాన్ని సమకూర్చి దివ్యసందేశాన్ని అందజేసే దీపావళి.

రాత్రయింది. ప్రతియింట ప్రమిదలు వెలుగుతున్నాయి. ఆ గాఢాంధకారంలో దీపాలు అలంకరించబడిన భవనాలు వింత ఆకృతులతో కానవస్తున్నాయి. ఊహాప్రపంచానికి సంబంధంలేని పిల్లలు వింత వింత మందుగుండు సామానులను కాలుస్తున్నారు; ఏ మేమో కేకలువేస్తూ, పక పక నవ్వుతూ, కిల కిలలాడుతూ, మరొక్క సమయాన భయావృతమైన హృదయంతో 'అమ్మో' అని హడిలిపోతూ, మనోల్లాసంతో గంతులు వేస్తున్నారు. "అబ్బ" అంతా అందమే. వాస్తవానికి ఆరోజు అమావాస్య అయినా అంతా వెలుగే.

ఊరంతా దీపాలకాంతిలో విలీనమై పోయింది. అందరి హృదయాలు ఆనందసముద్రములో ఓలలాడుతున్నాయి. ఊరంతా ఆనందరాగా న్నాలపిస్తోంది. ఆనంద్ హృదయం ఆవేదనారాగా న్నాలపిస్తోంది. ఊరంతకీ దీపావళీ ఆనంద్‌కు నిశావళీ....ఇంటింటా ఆనందం ఈ యింట విషాదం.

"ఆనంద్ :" దీనంగా కేక వినపడింది. ఆ కేకలో ఆవేదన జీర్ణించుకుపోయి ఉంది. ఆ కేకవిన్న ఆనంద్‌కు నవ నాడులు కృంగి

పోయినాయి. ఏవాయిన లేచాడు. సరాసరి తల్లి మంచాన్ని సమీపించాడు. అతనికళ్ళు చెమ్మగిల్లాయి. కన్నీటిలో మునిగి తేలే కన్నతల్లి దీనవదనం లోకి చూచాడు సూటిగా. హృదయవీణ అపశ్రుతి పలుకుతోంది ఎందుకో. అతని మస్తిష్కంనుండి ఏదో భావము తుపానులా వీచింది, గుండె ఝల్లుమంది. నిర్జీవుడై చూస్తూ వుండిపోయాడు.

కన్న కొడుకును కనులార చూచింది మాతృమూర్తి. కని, పెంచిన బిడ్డ ఆవేదనా పూర్ణ వదనాన దీనంగా తనవైపుకు చూచే కనులు ఆమెగుండెను రగిలింపజేశాయి. ఆమె పరిస్థితి చూస్తూ అతను నిలువునా నీరై పోయాడు, అశ్రుపూరిత నయనాలతో తల్లివైపు చూస్తూ,

"ఏమిటమ్మా!" అన్నాడు.

"ఇట్రారా. ఇక్కడకూర్చో. ఈ రోజు నాతల పగిలిపోతూంది. ఆయాసంగా వుంది." అంటూ కడసారే నన్నట్టు చూస్తోంది.

తన వొడిలో తల్లితలవుంచి మందుత్రాగిస్తూ, "బాధగా వుందా? అమ్మా!" ఆవేదన దిగమ్రింగు కుంటూనే ప్రశ్నించాడు.

"బాధకేంగాని నీతో ఒక్క విషయం చెప్పాలిరా."

"ఏమిటమ్మా?"

"అంతా జాగ్రత్తగా విను నాయనా! ఈనాడు చెప్పవలసి వచ్చి చెపుతున్నాను.

మా అమ్మకు నేను, మా అన్నయ్య ఇద్దరమే పుట్టాం. మా నాన్న మా చిన్ననాడే చనిపోయాడు. మా అమ్మ ఎంతో గారాబంగా పెంచి పెద్ద వాళ్ళను జేసింది. కాస్తో కూస్తో ఆస్తి వుండబట్టి కాలం అను కూలంగానే సాగిపోయింది. అన్నయ్య పెండ్లి అయింది. ఆ తరువాత నా వివాహ విషయంలో అమ్మా, అన్నయ్యా చెరోదారీ త్రొక్కారు.

ఆఖరుకు అమ్మమ్మే నెగ్గింది. అప్పటినుండి అన్నయ్యకు తలకొట్టి నట్లనిపించింది. ఇంట్లోవున్న మాతోకూడ అన్నయ్య మాట్లాట్టం మానేశాడు. ఆ బెంగతోనే అమ్మ మంచంపట్టి చనిపోయింది. ఆ తరువాత నేను కాపరానికొచ్చాను. అన్నయ్య కప్పటికికూడ కోపం చల్లార లేదు. తరువాత నీవు పుట్టావని తెలిసికూడా నిన్ను చూట్టానికిరాలేదు. కాలం సాగిపోయింది. అన్నయ్యకు ఆడపిల్ల కలిగింది. కాని నాకు కబురంపలేదు. నేను వెళ్ళనూలేదు. ఆ నాటినుండి ఈ నాటివరకు ఆ తెగినత్రాడు ముడిపడనేలేదు. నీకు మాత్రం మేనమామ వున్నాడు. నీ రక్తానికి సంబంధించినవారు లేరని నీ వెప్పుడు బాధపడవద్దు. ఈ లోకంలో నువ్వు ఏకాకివికావు. ఈ లోకంలో నీవు ఏకాకివికావు —" అంటూనే స్పృహను కోల్పోయింది.

"ఏ వూరమ్మా? ఆయన పేరేమిటమ్మా?" అతనికనుకొలుకుల నుండి నీరు స్రవిస్తూనేవుంది. కాని అతని ప్రశ్నలకు సమాధానము ఇవ్వకుండానే అంధకారబంధురమైన అనంత జగత్తులో ఆమె సమాధి అయిపోయింది.

"అమ్మా!" అని గుండెలు పగిలేటట్టు, పేగులు తెగేటట్టు కేక పెట్టి తల్లి శవంమీద వ్రాలిపోయాడు. మరి రెండు నిమిషాలలో తేరుకున్నాడు, ఆ యిల్లంతా అతని యేడ్పుతో నిండి పోయింది.

ఆనంద్ ఆవేదనలో పాలుపంచుకొనేందుకు అతనివారంటూ ఎవరూలేరు ఆక్షణాన. కన్నతండ్రి ఏనాడో కాలగర్భంలో కలిసి పోయాడు. కని పెంచిన తల్లి ఈనాడు శాశ్వతంగా కన్నుమూసింది. తండ్రిపోయిన నాటినుండి తనతల్లి ఎన్నికష్టాలకు వోర్చి తనను చదివించిందో అతనికితెలుసు. తన చదువుకోసం, తనతల్లి కష్టించి, తనక్షేమంకోరి తనను ఈనాటికిలా ఎలా తయారుచేసిందో అతనికి

తెలుసు. అటువంటి మాతృమూర్తి, చల్లనిమూర్తి, ఈనాటితో అంతర్ధాన మైంది. భావిజీవితం శూన్యమనిపించిందతనికి. అతనిచుట్టూ ఆవరింప బడిన పరిస్థితుల ప్రభావాలు అతని జీవితాన్నెలా తయారుచేస్తాయో అతనికే తెలియదు. భావిజీవితంవైపు వొంగి అతను చూచిన మరు క్షణం అతనిగుండె వణకకమానదు. ఉన్నఆస్తి కాస్తాకూస్తా మినహా యించి తండ్రి దుర్వ్యసనాలకు ఆహుతి అయిపోయింది. మిగిలినఆస్తి తన చదువుకి హారతి అయిపోయింది. ఆస్తి హారతయినా అతనికి దరి దొరకలేదు. చదివింది బి. ఏ. అయినా, డిగ్రీ చేతికివచ్చినా లాభము శూన్యమయింది. అటువంటి ఆనంద్ కీనాడు నిలువనీడకూడలేదు. ఇప్పుడున్నయిల్లుకూడ తాకట్టులోనేవుంది. ఆ యింటిలో ఆయేద్వప్రాప్తి అతనికి—

౨

ఉదయం 7 గంటలయింది. తెల్లవార్లూ ప్రయాణంచేసి విసుగూ విరామం లేకుండా తనకర్తవ్యాన్ని తాను నిర్వహించి గమ్యస్థానానికి వచ్చి చేరింది రైలుబండి. జనం గుంపులుగుంపులుగా దిగుతున్నారు, స్టేషనంతా వింతవింత ధ్వనులతో హోరెత్తిపోతోంది. ఏమిటో అంతా గందరగోళమే.

ఫస్టుక్లాసు కంపార్టుమెంటులోంచి కనులు మిరుమిట్లుకొల్పుతూ దిగింది అందమైన అమ్మాయి. చేతిలో చిన్న లెదరుసూట్‌కేసువుంది. చరాచరా నడచివస్తోంది. అంతలో బూటుకాలు అరటితొక్కమీద పడింది. యింకేముంది! టపీమని పడింది. అందరూ ఫక్కుననవ్వారు. అంతలో ఆమెకు చేయూతనిచ్చి లేవదీశాడుఎవరో. లేవదీసి సహజంగా

"దెబ్బతగిలిందాండీ ?" అని ప్రశ్నించాడు. అతని మాటల్లో ఔదార్యం పుట్టిపడుతోంది.

"తగల్లేదులెండి" అంటూ అతని మొగంలోకిచూస్తూ "థాంక్స్" అంది అప్రయత్నంగా.

"నోమెన్షన్" అంటూ క్రిందపేసిన హోల్డాలు చేతిలోకి తీసికొని చరాచరా సాగిపోయాడు.

అతన్ని పిలుద్దామనుకొంది. ఏమిటో అతనివైపుచూస్తూనిల్చుంది. ఏమిటోగా కనులు అటూయిటూ తిరిగాయి వొకసారి. అంతే. అతన్ని మాత్రం పిలువలేకపోయింది. అలానేచూస్తూ నిల్చుండిపోయింది. ఆ క్షణం ఆమెమనసు యేలోకంలోనో విహరిస్తోంది. ప్రక్కనుండి వచ్చే పకపకలూ, దాణాల్లా గ్రుచ్చుకున్నాయి. వెంటనే ఈ లోకంలోపడి చరాచరా బయటకు నడిచివచ్చింది. కనులెవరికోసమో వెతికాయి. కాని లాభం శూన్యమనిపించిందెందుకో. ఆమెవదనం అసంతృప్తిని ప్రకటించింది. ఆటోరిక్షానిపిల్చి తను చేరవలసిన చోటు చెప్పి కూర్చుంది.

ఆ మహాపట్నానికి వెలుపలగా వున్నదా భవనం. అది పట్నానికి కొంచెం దూరంలోనే వుంది. అటుగా పెద్ద నది ప్రవహిస్తోంది, ఆపరిసర ప్రాంతం ఎంతో హాయి నందజేస్తుందనడంలో సందేహమనవసరం. ఆ మేడ ఎంతో అందంగా వుంది. ముందు గేటుపైగా మాలతీలత దట్టంగా ప్రాకివుంది. పచ్చని ఆకుల్లోనుండి తెల్లనిపూలు ఎంతో అందంగా కానవస్తున్నాయి. ఆ గేటువద్దకొచ్చి ఆగింది ఆటోరిక్షా. అతనికి డబ్బిచ్చి లోపలికి వెళ్ళిపోయిందామె. ఆమె మస్తిష్కమతన్ని గురించి ఆలోచిస్తూనేవున్నది. ఎంత ఆలోచించినా ఆమెకు నిరాశే ఎదురవుతూంది. అతనెవరో, అతని నివాస మెక్కడో ఆమెకెలా తెలుస్తుంది!

సాయంత్రమయింది. సూర్యభగవానుడు భూగర్భంలోకి చొచ్చుకుపోయాడు, పశ్చిమ ప్రాంతము కొంచెం కాంతివంతంగా వుంది. అంతా వింతే! అనంత జగత్తులో ప్రతి విషయం ఒక వింతే. సూర్యాస్తమయం! చంద్రోదయం! ప్రకృతిలో ఎంత వింత యిమిడివుంది! ఒకరు పోతేనేకాని మరొకరు కనుపడరు. ఒకడు ఆరితేగాని మరొకడు పైకిలేవడు. అంతా వింత. అంతా అగమ్యగోచరం.

వెనుక తోటలో ఫౌంటెన్ ప్రక్కన కూర్చుంది మాలతి. ఫౌంటెన్ నీళ్ళను పైకి ఎగజిమ్ముతూంది. నీటి బిందువులు ముత్యాల్లా క్రిందపడుతున్నాయి. పువ్వులపైన వ్రాలి మకరందాన్ని గ్రోలుతూ రెక్కలాడిస్తూ లేస్తున్నాయి సీతాకోక చిలుకలు. చల్లని గాలులు హృదయాన్ని పుంకింప జేస్తున్నాయి. అంతా అందమే. అంతా ఆనందమే. కాని ఆమె మదిలో ఏదో మరుగుతూనేవుంది. ఆమె మనస్సులో అతను మరొక్కసారి మెదిలాడు, ఆమె అతన్నిగురించి మళ్ళీ ఆలోచించ సాగింది. ముఖంలో విషాదం ప్రజ్వరిల్లుతూంది, ఆమె మస్తిష్కంనుండి ఆలోచనలు మెల్లగా సాగాయి.

అతన్ని చూచేదెలా? అసలతనెవరు? ఎక్కడుంటాడు? తెలుసుకోలేకపోయాను. ఎంతమంచివాడు! ఆ పరిస్థితుల్లో అక్కడ నేనెంత బాధననుభవించాను? ఏమిటో ఈ పాడులోకం.... పడగానే పకపకమంది. కాని లోకమంతా అంతేకాదన్నట్లు, ఈ లోకం మానవత్వం కోల్పోలేదన్నట్లు ఆ విజ్ఞాన దీపిక చేయూత నిచ్చాడు. అందరు ఒకే తీరుగా వుండరుగదా! పాపిష్ఠిదాన్ని, పేరుకూడ అడగలేకపోయాను. అతన్ని చూచేదెలా? ఎవరో తెలుసు కొనేదెలా? ఆ విజ్ఞాన దీపికను నా ఆశాదీపికగా చేసుకోగలనా? ఎలాచేసికొంటాను? అతనెవరో అసలు తెలియనే తెలియదుకదా!" అనుకుంది. వెను

వెంటనే ఆమెగుండె ఝల్లుమంది. శిలలా శూన్యంలోకి చూస్తూవుండి పోయింది. తెలిమబ్బుల చాటునుండి చందమామ దూసుకుపోతున్నాడు. ఒక్క క్షణం మబ్బులచాటున, మరోక్షణం నీలి ఆకాశాన. చందమామకేసి చూస్తూకూర్చున్న మాలతి మనస్సు మూల్గింది బాధగా. మెల్లగా లేచి సాగింది తనగది కోసం.

అలానే బాధలో సాగిపోయాయి కొన్ని దినాలు. ఆ రోజు ఆమె తనగదిలో పడుకొని కిటికీలో నుండి రోడ్డువైపుకు చూస్తోంది. ఆకాశ మంతా మబ్బులతో కప్పబడివుంది. వురుములు వురుముతున్నాయి. కిటికీలోనుండి చల్లనిగాలి వీస్తోంది. ఆమె అలా చూస్తూనే పడుకొనివుంది. ఆమెకు ఈ వారమంతా వెగటుగానేవుంది. సరిగా ఆహారంకూడా తీసు కోవడం లేదనే చెప్పాలి. కనుమూసినా, కనుతెరచినా, కనులముం దతనే కనిపిస్తున్నాడు. తనచేతిని పట్టుకొనిలేవదీసిన సంఘటనే కనపడు తూంది ఆమె హృదయం చల్లారదేమో! అతన్ని చూచేవరకూ........ ఆమె ఎంత లక్షాధికారి కూతురైనా ఏది కావాలంటే అది అక్షణంలో ఆమె కాలిముందుకు వచ్చినా ఈ విషయంలో ఆశలేదు. ఆమెమనసు వికలమైంది. అతను కనపడకపోతే ఏమిచేయాలన్నదే జటిల సమస్య ఆమెకు.

వర్షంపడటం ఆరంభమైంది. ఆమె రోడ్డువైపు చూస్తూనే వుందలా. ఎవరో ఒకతను గబగబా అడుగులు వేసుకుంటూవచ్చి మాలతీలత క్రింద నిలబడ్డాడు. గేటువైపుచూస్తూ వుండిపోయింది. అత నెవరో స్పష్టంగా మాత్రం కనపడటంలేదు. నాన్నగారికోసం వచ్చా రేమో ననుకొంది. నాన్నగారి కోసమైతే లోపలకిరాకుండా అక్కడే వుంటాడా? అన్నప్రశ్న ఎదురైంది, వర్షంవస్తుంటే తలదాచుకున్నా డేమో ననుకొంది. అంతేనని నిశ్చయించుకొంది. అలా అనుకుంటూండ

గానే అతను కొంచెం ఇవతలకువచ్చాడు. అతను యిప్పుడు అస్పష్టంగా కనపడుతున్నాడు. వర్షధారలను తప్పించుకోడంకోసం అటూ, యిటూ తిరగడం, పైవేపుచూడటం, అంతా చూస్తూంది. అతని అవస్థ చూస్తూంటే జాలివేసింది. అంతలోవర్షం నిదానించింది. ఆమె తనకళ్ళను తానే నమ్మలేకపోయింది. చివాలునలేచి నిల్చుంది. మళ్ళీవర్షం జోరుగా పడుతోంది. మనుష్యులా వర్షధారలలోనుండి కనపడే అవకాశమేలేదు. మళ్ళీ హృదయంలో అనుమానం పొడసూపింది. తదేకదృష్టితో చూస్తూంది. ఆకాశానికి భూమికి మధ్యఉన్న ప్రదేశమంతా తెల్లగా కానవస్తోంది. ఈ సారి మనిషికూడ సరిగా కనపడటంలేదు. తెల్లగా ఆకృతిమాత్రం కానవస్తోంది. చేతిలోకి గొడుగు తీసికొని, చరచరా దిగివచ్చింది హాల్లోకి. చీరకుచ్చెళ్ళు చేతితో పట్టుకొని మరొకచేతితో గొడుగును పట్టుకొని సరాసరి అతనికేసి నడిచింది.

అతడామెను చూచాడు. చల్లనిగాలి వేగంగా వీస్తోంది. మన సెంతో అల్లరిచేసింది. మోకాలి క్రిందివరకు కుచ్చెళ్ళ నెత్తిపట్టుకొని నల్లటి గొడుగు క్రింద బంగారు బొమ్మలావచ్చే యువతి సహజ సౌందర్యాన్ని చూస్తున్నాడు. ఆ వర్షంలో ముందుకు రాలేక రాలేకవచ్చే పాదాలు ఎంతో అందంగా కానవస్తున్నాయి. వర్షపు బిందువులు ఆమె కాళ్ళపై పడి ముత్యాల్లా మెరుస్తున్నాయి. దగ్గరకొచ్చే కొలది. అతని గుండెవేగంగా కొట్టుకుంటోందెందుకో. ఆమెవచ్చి నిలబడి అతనికేసి చూస్తూ.

"హల్లో! మిష్టర్" అంది. అతనికేమీ అర్థంకాలేదు. ఎవరినో అనుకొని అర్థంకాక అటూ యిటూ చూచాడు.

"అలా బిత్తరపోయి చూస్తారేం?" చనువుగా ప్రశ్నించింది.

"చచ్చాంరా భగవంతుడా! ఈమెయెవరు? అసలు నన్నెలా యెరుగుంది?" అప్రయత్నంగా అనేక ప్రశ్నలు అతని మస్తిష్కంనుండి వుద్భవించాయి. సతమతమయి ధైర్యం తెచ్చుకొని ఆమెవైపు చూచాడు ఎక్కడైనా పరిచయమైన ముఖమేమోనని.

"అలాచూస్తారేం?" అంటూ ఆమె అతనికూడా పట్టింది గొడుగు.

అసలతని కేమనాలో అర్థంకాలేదు, అతను తటపటాయించి అన్నాడు. "మీ రెవరో నాకు గుర్తురాలేదు."

"ముందు లోపలికిరండి. చెప్తాను."

"నే నెలాగూ తడిశాను. ఈ కాస్తదూరంపేగా. పదండి."

"అవకాశం వున్నప్పుడు తడపవలసిన పనేముంది?" అతని కళ్ళల్లోకి అదొకరకంగా చూస్తూ అంది సూటిగా.

ఆమె వింత సంభాషణ అతని కర్థంకాలేదు.

"ఫరవాలేదులెండి!"

"ఉపకారికి అపకారం చేయటంమానవలక్ష్యం కాదు. మీరే గొడుగులో వెళ్ళండి."

"ఒద్దులెండి. అనవసరంగా మీరు తడవటం దేనికి?"

"ఇద్దరం పోగూడదాండి?"

ఆమె స్వరం అతని కదోరకంగా వినబడింది. అతని గుండెలవిసి పోయాయి. అతని మనసు యెందుకో వెనుకంజవేసింది. ఆమె వైపు చూస్తూ 'ఒక్క గొడుగులో ఇద్ద రెలాగురా భగవంతుడా? పైగా పరాయి స్త్రీ' అని తనలో తాను అనుకుంటూండగానే ఆకాశంలో మెరుపూ, తలలో మెరుపూ ఒకేసారి మెరిశాయి. ఆమె వొకసారి చూచి

చకాచకా హాల్లోకి వచ్చాడు. అతన్నిచూస్తూ చిన్నగా నవ్వుకుంది. ఆమెకూడావచ్చి గొడుగు మడచి ప్రక్కన పెడుతూ,

"ఏం మిష్టర్ ! అలా వచ్చేశారు ?" చిరునవ్వుతో ప్రశ్నించింది.

"ఇద్దరం తడిసిపోవాలిగదా అని" సమాధాన మిచ్చాడు అదో రకంగా చూస్తూ.

అతని ప్రవర్తన చూచేసరికి గుండెఝల్లుమంది. అతనికి వివాహమైందేమోనని అనుమానం పొడసూపిందామె హృదయంలో.

"మీరేమనుకోకుండావుంటే ఒక్క ప్రశ్న వేయాలని వుంది."

"వేయండి" అంటూ జేబులోని కాగితంతీసి చేతిలోనున్న పుస్తకంలోపెట్టి ప్రక్కగావున్న కిటికీలో పెట్టాడు.

"మీకు వివాహమయి ఎంతకాలమయిందండి ?"

"అసలు ఆ విషయమే ఆలోచనలో లేదింతవరకూ"

ఆమె కెందుకో అమితానందం కల్గింది. రెక్కలు ఝళిపించి నట్లనిపించింది. "అయ్యో! ఆపుస్తకంతడిసినట్లుందే?" అంటూ ఆపుస్త కాన్ని తీసికొని తన చీరచెంగుతో తుడవటం మొదలెట్టింది. పుస్త కంలో నుండి ఏదో కాగితం క్రిందపడింది, "అరె!" అంటూ చేతిలోకి తీసికొని మడతలువిప్పి చూచింది. అది B. A. డిగ్రీ సర్టిఫికెట్టు. ఫస్టు క్లాసులో ప్యాసైనట్లుంది. ఆశతో పేరుచూచింది. "ఆనంద్" అని వుంది, ఆనందించిందామె. కాగితం మడతపెట్టి పుస్తకంలోపెట్టి చేతిలోనే వుంచుకొని అతనివైపుకు చూస్తూ "లోపలికొస్తారా ?" అంది.

"క్షమించండి. నేనిలా అడుగుతున్నందుకు మీరేం బాధపడకండి. అసలు మీరెవరో నాకు తెలియలేదు."

"తెలియదా ?"

"ముమ్మాటికీ తెలవదు. ఇందాకటినుండి ఆలోచిస్తూనే వున్నాను. నాకసలు అర్థంకాని సమస్య అయిపోయింది."

"బి. ఏ. ఫస్టు క్లాసులో ప్యాసైనవారికికూడ అర్థంకాని సమస్యలుంటాయా ?"

"ఈ సమస్యలు పుస్తకాల్లో వుండవని మీకూతెలుసనుకుంటాను."

"సర్లెండి; అయితే నేనెవర్నో మీకు తెలీదన్నమాట."

"తెలిస్తే ఈ రభసంతా దేనికండి!"

"ఆచేయి నాచేతినెందుకు పట్టుకుందో మీచేతినే అడగండి."

"అరె! భగవాన్ ఇదెక్కడిగొడవండి! నేనింతవరకు ఎవరిని ముట్టుకోలేదు. కలలోనైనా మీచేయి పట్టుకున్నాననుకోటానికి మిమ్మల్ని చూచింది ఈక్షణమేకదా! అటువంటప్పుడు మీచేతిని నేనెలా పట్టుకొని వుంటాను ?"

"అబద్ధమాడటం అధర్మం."

"అయ్యో రామా! ఇదెక్కడిగొడవ!"

"ఆ! ఆ! దేవుణ్ణి పిలవకండి. వారంక్రితం మీరు రైల్వేస్టేషనులో నాచేయిపట్టుకోలేదూ?" చిరునవ్వుతో అంది.

"చచ్చాం పొండి. అప్పుడు మిమ్మల్ని సరిగా చూడలేదు. నా గొడవలో నేపోతున్నాను, మీరు పడ్డారు. నే చేయూతనిచ్చాను. కాని, ఆనాటి ఆసంఘటన ఈనాడు ఈసంఘటనను సృష్టిస్తుందని నేను కలలో కూడ అనుకోలేదు. అసలెవరైతేమాత్రం ఎలా ఊహించగలమండి?"

"పోనీండి. ఇప్పుడైనా యింట్లో అడుగుపెడతారా ?"

"ఎందుకులెండి, ఎలాగూ తడిశాను. నా బసకు చేరితే సరిపోతుంది."

"కాఫీ తీసుకువెళ్ళగూడదండీ!"

"ఆ! ఎందుకులెండి ?"

"మీరు కాఫీత్రాగి వెళితేగాని నాకు సంతృప్తి వుండదు."

అప్రయత్నంగా అతను సాగాడు. ఆమె అతన్ని కూర్చోపెట్టి కొన్నిబట్టలు తీసుకువచ్చి బాత్‌రూముకు తీసుకుపోయింది. ఇద్దరూవెళ్ళి ఆగారు. ఆమె వెనుతిరిగింది. ఆనంద్ లోనికెళ్ళి బకీటులో చేయి పెట్టాడు. చర్‌మంది. 'చచ్చాంరా! భగవాన్' అనుకొని "ఏమండీ!" అంటూపిలిచాడు. ఆమెవచ్చి అంది.

"నాపేరు 'ఏమండీ' కాదండీ! మాలతి. ఎందుకు పిలిచారు ?"

"వేడినీళ్ళస్నానం నాకు అలవాటు లేదండి."

"చన్నీటిస్నానమే చెయ్యండి."

"మరో బకీటులేదండి," అని అతనంటూండగానే ఆమెవేడినీటిని వంచేసింది.

"అయ్యోరామా ! మీరే చేయిచేసుకున్నారా ?"

"పనిమనిషి ఇంటికి వెళ్ళిపోయింది. ఇంట్లో ఎవ్వరులేరు. మా కర్తవ్యం మేము నిర్వహిస్తే తప్పేమిటండీ ?"

"ఈ విశాలమైన భవనంలో మీ రొక్కరే వున్నారేం ?"

"మా అమ్మ మా అమ్మమ్మగారింటి కెళ్ళింది, మానాన్నగారింకా ఇంటికే రాలేదు." అంటూ బయటికి వచ్చింది.

"మీకు లేనిపోనిశ్రమ యిచ్చాను." అన్నా డతను.

"మీకిచ్చిన శ్రమకంటే పెద్దదా ?" అంటూ రెండడుగులు ముందుకేసి మళ్ళీవెనక్కివచ్చి "నాకు అన్నలు లేరు సుమండీ !" అంటూ వెళ్ళిపోయింది.

తలుపులు బిగించి స్నానానికి సంసిద్ధుడయ్యాడు. ప్రక్కనున్న బట్టలు చూచి ఆమె అలా ఎందుకందో అర్థంచేసికొన్నాడు. మొత్తంమీద ఏదో ఆలోచించుకుంటూ స్నానం ముగించాడు.

ఇద్దరూ కాఫీ త్రాగుతూ మాట్లాడుకుంటున్నారు. వర్షం కురుస్తూనే వుంది. అతని బట్టలు ఆమె పిండి ఆరవేసిందంతకుమునుపే. ఆ బట్ట లతను వేసికొన్నాడు. ఇద్దరూ మరికాసేపు మాట్లాడుకున్నారు. ఆ తరు వాత అచటనుండి తిరిగి బయలుదేరాడు. అతని మస్తిష్కంనుండి ఎన్నో ఆలోచనలు రైళ్ళలాపరుగెత్తుతున్నాయి. అసలు తన ప్రస్తుత ప్రవర్తన తనకే ఆశ్చర్యాన్ని కల్గించింది. ఆలోచించుకుంటూ హోట లుకు బయలుదేరాడు. అతని ఆలోచనలకు అర్థం పర్థంకనిపించటం లేదతనికి.

"అసలా అమ్మాయి ఆనాడు పడటమేమిటి? పడిందే అనుకో, నేనా అమ్మాయికి చేయూతనివ్వడమేమిటి? ఇచ్చానేఅనుకో; ఆ అమ్మాయి నన్నంతగా ప్రేమించడమేమిటి? ప్రేమించిందే అనుకో; ఈ నాడు ఈ సంఘట నిలా త్రోసుకురావడమేమిటి? అంతాగమ్మత్తుగానే జరిగి పోయింది. అసలా అమ్మాయి ప్రవర్తన చూస్తూవుంటే నన్ను ప్రేమిస్తోందని చెప్పక తప్పదు. ఆ అమ్మాయి ఎక్కడో ఆకాశాన నక్షత్రంలావుంది. మనమో అథః పాతాళంలో అణగారి వున్నాం. అసలా విషయం అలావుంచు. అసలానాడు అమ్మప్రాణాలర్పించే నాడన్నివిధాలచెప్పింది నాకు. ఆ మాటల వెనుక అర్థము అనంతంగా వుందే. అంతాఖర్మ. పరిస్థితుల ప్రభావానికి మనం లొంగక తప్పదుగదా! ఖర్మకాకపోతే; కథంతా చెప్పి కథకు మూలమేమిటో వివరించలేదే. ఆయన పేరేమిటో! ఆయన ఎక్కడుంటారో? చెప్తే ఎంత బాగుండేది. నేనిలా బాధలకు గురి అవ్వాలని వుంది కాబోలు. అందుకే అమ్మఆపేరేమిటో కూడా చెప్పకుండానే ప్రాణంవిడిచింది." అని తనలో తాను అనుకున్నాడు. అతని ఆలోచనలకు అంతంటూలేకుండా పోయింది. అతని హృదయంలో అర్థరహిత వ్యర్థభయం...........

మళ్ళీ అతని మస్తిష్కం మాలతినిగూర్చి ఆలోచించ సాగింది. ఆ అమ్మాయి ప్రేమించిందనడంలో సందేహం లేదనే స్పష్టంగా కనబడుతోంది. కర్మంగాలి నేను సరితూగే వాణ్ణనుకుందేమో! ఎలా అనుకుంటుంది? మన ఆకారం ఆమెకు కనబడుతూనే వుందిగదా! ఏది ఆలోచించినా అర్ధరహితంగావుంది. ఏదారిన సాగిపోదామన్నా చీకటే ఎదురవుతూంది. భావిజీవితమంతా భయంకర పరిస్థితులకు గురికావలిసివుందేమో....నా అదృష్టం బాగుంటే అమ్మ నా ఆఖరు ప్రశ్నలకు సమాధానమే చెప్పేది. అటూ ఇటూ ఎటుచూచినా పరిస్థితులు భయంకరంగానే ఉన్నాయి. అమ్మ ఆనాడు రక్తసంబంధ ప్రస్తావన ఎత్తకుండావున్నాబాగుండేది. అమ్మ ఆనాడు ఆ ప్రస్తావనే ఎత్తకపోయినట్లయితే మాలతిని మనస్ఫూర్తిగా ప్రేమించటాని కవకాశముండేదికదా! ఇంతకీ నాజాతకం బాగుండలేదు. విషయం తెలిసిన తర్వాత ఆత్మవంచన చేసికోలేంగదా! అయినా, అమ్మమాటల్లో దాగిన అర్థంనాకు తెలుసు. అమ్మ ఆశయం ఎలానెరవేరుతుంది? అసలు వాళ్ళకీ మాకూ సంబంధ బాంధవ్యాలు తాతలనాడే అంతరించాయిగదా! ఒకవేళ అదృష్టవశాత్తు కలుసుకునే అవకాశం సనుకూడిందే అనుకో; మనం వెళ్లినా "ఛీ! ఎవడ్రా నువ్వు? పో! పో!" అంటే............ అసలిన్ని పిచ్చి ఆలోచన లెందుకు? వాళ్ళు కనపడతారన్న మాట సున్న. వూరు పేరు తెలియకుండా, మనిషి పేరు తెలియకుండా వారి నెలా తెలుసుకోగలం. నావాళ్ళంటూ ఎవరన్నావుంటే వాళ్ళను కలుసు కుందామా అంటే ఈ అనంతజగత్తులో నావాళ్లెవరూ లేరుకదా! ఈ పరిస్థితులనుబట్టి చూస్తే నేను ముమ్మాటికీ ఈ అనంతజగత్తులో ఏకాకినే, ఇంకానయం. అమ్మ ఎంతో కష్టించి చదివించింది. లేకపోతే నా జీవితం ఇంకెంత దారుణంగా పరిణమించేదో ఆ భగవంతుడికే

తెలియాలి. ఈ సంగతి అటుంచి ఖర్మంకాలి ఆ అమ్మాయితో విషయా లన్నీ చెప్పానే ! ఈ రోజు సాయంత్రం రమ్మంది. అక్కడికి వెళ్ళాలంటే నా హృదయం వెనుకంజవేస్తోంది. వెళ్ళకుండా వుండటం సర్వవిధాలా శ్రేయస్కరం. కలవారితో సంబంధంవల్ల నాబోటి వాడికి లాభం శూన్యం. ఉపకారానికి ప్రత్యుపకారం చేసింది. ఇక మనం వెళ్ళనక్కరలేదు. వెళ్ళడం మంచిదికూడా కాదిక. ఖర్మంకాలి అడ్రసు ఇచ్చాను. చేతులు కాలిన తర్వాత ఆకులు పట్టుకు నేంలాభం ? ఇక బసమార్చటమే తక్షణకర్తవ్యం." అనుకొన్నాడు ఆనంద్.

అలా ఆలోచిస్తూ హోటలుకు వచ్చాడు. వెంటనే బసమార్చి వేశాడు.

ఆనంద్ జేబులో డబ్బులయిపోయాయి. ఇక రెండు రూపాయలు మాత్రం అతనివేపు చూస్తూ వెక్కిరిస్తున్నాయి. అతనికి ముందు పరిస్థితులు భయంకరంగా కనిపిస్తున్నాయి. తనలో తాను బాలా బాధ పడ్డాడు. ఉద్యోగంకోసం అతను తిరగని ఆఫీసంటూలేదు. ఏ ఆఫీసుకు పోయినా ప్రొద్దెదురే; ఏ కంపెనీకి వెళ్లినా చుక్కెదురే. ఇక తనకు వుద్యోగం దొరుకుతుందన్న ఆశకూడా నశించింది. జేబులో చూస్తే రెండు రూపాయలేవున్నాయి. పాపం ! ఎంతహీన పరిస్థితులావరించాయి! బి. ఏ. ఫస్టుక్లాసులో ప్యాసయ్యానుగదా అన్న ధైర్యంతో వుద్యోగం కోసం వచ్చాడేకాని, బి. ఏ. ప్యాసైతే వుద్యోగం వస్తుందన్న ఆశతో రాలేదు. అసలిప్పుడు కర్తవ్య మేమిటో....అతనికే తెలియదు. ఆఖరుసారి ప్రయత్నం చేయాలని నిశ్చయించుకున్నాడు. ఇక అతని అదృష్ట మెలా ఉన్నదో ఆ భగవంతునికే తెలియాలి.

ఉద్యోగంకోసం తెగ తిరుగుతున్నాడానంద్. లాభం మాత్రం శూన్యం. ఉద్యోగాన్వేషణ సాగుతూనే వుందలా. ఎవరిద్వారానో

లాభంకలుగుతుంచని విన్నాడు ఎక్కడో. చివరికాకంపెనీకి బయల్దేరాడు. ఆ కంపెనీ పట్నానికి దూరంగానేవుంది. రిక్షావాణ్ణిపిల్చి అడిగాడు. మూడుపావలాలిమ్మన్నాడు. విధిలేక కాలికిబుద్ధిచెప్పాడు తనలో తనను తనే నిందించుకొంటూ.

## 3

రాఘవరావుగారు పెద్ద స్థితిపరుడు. ఆయనకు పెద్ద పింగాణీ ఫ్యాక్టరీవున్నది. ఆ ఫ్యాక్టరీ పట్నానికి 5, 6, మైళ్ళదూరంలో వుంది. ఆ పెద్ద ఫ్యాక్టరీ నిర్మాణ మక్కడ జరిగింది. రాఘవరావుగారు తన అపారమైన తెలివితేటలతో ధనమార్జించాడు. కొందరాయనను కోటీశ్వరులలో లెక్కవేస్తారు.

ఆ నాడు రాఘవరావుగారు మొత్తం ఇరవైనాలుగువేలు తీసికొని ఇంటికి బయలుదేరాడు తన కారులో. పండువెన్నెల కాస్తోంది. టైము ఎనిమిదిగంటలు కావస్తోంది. రివ్వునపోయేకారు అప్రయత్నంగా మలుపు తిరిగి కొంతదూరం వచ్చి ఆగింది.

"ఇదేమిటి డ్రయివర్ ?" ప్రశ్నించాడాయన వెంటనే.

"పొరపాటు జరిగిందిసార్. చాలాదూరం వచ్చాము. ఆపై మలుపు నుండి పోదాంసార్" అంటూ పోనిస్తూ కొంచెం ఎత్తుగావున్న శిలా ప్రాంతంప్రక్కగా ఆపాడు కారు. ఆప్రాంతమంతా చెట్లగుబురులతోనిండి వుంది. ఆ ప్రదేశందాదాపురోడ్డుకు రెండుఫర్లాంగులదూరంలో వుంది.

"ఇదేమిటి ? ఇక్కడాపావెందుకు ?" ప్రశ్నించారాయన.

"నీళ్ళయిపోయాయనుకుంటానండి" అంటూ కారుదిగి పరకాయించిచూచాడు డ్రయివర్. అతని పెదాలపైన చిరునవ్వు రాఘవరావుగారెలా గమనించగలరు, కారాపి రెండునిమిషాలైనా కాలేదు. ఒకమనిషి

పిస్టలుతో సహావచ్చి కారుకు కొంచెము దూరములో నిలబడ్డాడు. ముఖానికి నల్లగుడ్డకట్టివుంది. అతను డ్రయివరుప్రక్కగా పిస్టలు కాల్చాడు. డ్రయివరుఅదిరిపోయినట్టు నటించి ఒక ప్రక్కగానిలబడి చూస్తున్నాడు లోలోన సంతోషంతో.

ఆ ప్రక్కగా కంపెనీనుండి వచ్చే ఆనంద్‌కు వినబడింది పిస్టలు ప్రేల్పు. ఆగి చుట్టూ పరకాయించిచూచాడు. మాటలు వినవచ్చేవైపుకు చూస్తూ నిల్చున్నాడు. మాటలు తీవ్రంగా వినిపిస్తున్నాయి. వారిదగ్గరగా వెళ్ళి చెట్లచాటుననుంచున్నాడు. అంతలో "డబ్బుతీసియిలాయివ్వండి ?" అంటున్నాడొక మనిషి.

"నాదగ్గర డబ్బులేదే" అన్నాడు మరొకాయన. ఆ సంభాషణ వింటున్న ఆనంద్ ముందుకు రాబోయి ఆగాడు.

"మాకు తెలుసు. ముందు ఇరవై నాలుగువేలూతీసి అక్కడ పెట్టండి" అన్నాడతను.

"నిజం చెప్తున్నాను, నా దగ్గరలేదు." అంటున్నాడాకార్లోంచి దిగిన మనిషి.

"ఉందిలేవయ్యా ! తోలుసంచి ముందిలాయివ్వు. లేకుంటే కాల్చే స్తాను" అంటున్నాడతను.

"యివ్వకపోతే ఏంచేస్తావ్?" అన్నాడాయన.

"యమలోకానికి పంపిస్తాను." పిస్టల్‌చూపుతూ అంటున్నాడతను.

ఆనంద్ అడుగులో అడుగు వేసుకుంటూవెళ్లి అతనిచేతుల క్రిందుగా చేతులువేసి మెడ నదిమిపట్టాడు. వెనువెంటనే అతనిచేతిలో పిస్టలు జారిపోయింది. ఆమరుక్షణం జారినపిస్టలును చేతపట్టాడు రాఘవ రావుగారు. ఆనంద్ అతనిమెడని గట్టిగానొక్కాడు. అంతలో చెట్లు

వాయినుండి పెద్దరాయి వచ్చిపడింది ఆనంద్ మీద. "అమ్మా" అంటూ అతన్ని వదిలాడు. అతను నేలనుకరుచుకొన్నాడు. ఆనంద్ వెనుదిరిగి రాయివచ్చినవేపుకు పరుగుతీశాడు. అతడికిముందుగా ఎవరో శర వేగంతో పరుగుతీస్తున్నారు. ఎలాఅయితేనేం! ఆనంద్ అతన్ని పట్టు కున్నాడు. ఇద్దరూ కొట్టుకున్నారు. చిట్టచివరికతను సోలిపోయాడు. అతన్ని కసిదీరాకొట్టి తీసికొచ్చి కారుదగ్గర పడవేశాడు ఆనంద్.

రాఘవరావుగారు వచ్చిచూడాడతన్ని. తనకారుడ్రైవర్. ఆయన కాశ్చర్యంవేసి "అరె! మా డ్రైవరేనే!" అన్నాడు.

"అయితే వాడికీవీడికీ సంబంధం వుండేవుంటుంది" అన్నా డానంద్.

"అలానేవుంది" అంటూ ఆ క్రిందపడ్డవాడ్నిచూచి "అరి దరిద్రుడా! వీడు మా హెడ్‌గుమాస్తా" అన్నాడాయన.

"ఇంకేం. మీ వ్యవహారం అంతా తెలిసే కుట్రపన్నారన్నమాట. ఈ ఫూల్స్‌నిపోలీసుస్టేషనులో వప్పజెప్పండి." అంటూ వాళ్లిద్దర్ని కారులో పడేసి, "వస్తానుసార్!" అంటూ వెను తిరిగాడు.

"మిష్టర్" అంటూ పిలిచారు రాఘవరావుగారు.

"వాట్ సార్ ?" అంటూ వెనక్కి తిరిగా డతను,

"మీరుకూడ నాతోరండి, మాట్లాడ్చోండి."

"కామిలెండి. నాకు పనుంది. క్షమించాలి."

"ఫరవాలేదులెండి. మీరు తప్పకుండా రావాలి."

ఆనంద్ మారు మాట్లాడకుండా వచ్చికారులో కూర్చున్నాడు. రాఘవరావుగారు కారుస్టార్ట్ చేశాడు. గాలిని దూసుకుంటూ రివ్వుమంటూ పోతోంటికారు. వారిద్దరి మధ్య మాటలు సాగాయి.

"మీరు దేవుళ్ళా వచ్చారు. లేకుంటే ఏమయ్యే వాడ్నో." అన్నాడాయన.

"నాదేముందిలెండి! అలా జరగాలనివుంది." జరిగింది. అన్నాడతను.

"ఏం జరగడమో! మీరు రాకుంటే మరుక్షణంలో నా ప్రాణాలు పోయేవి. అయినా ఎక్కడినుండి వస్తున్నారు మీరు?"

"ఏపోపనుండి వెళ్లి తిరిగివస్తున్నాను. అంతలో ఒక్కసారి పేల్పు వినబడి ఆగాను. మీ సంభాషణవిని అలా మెల్లగావచ్చి అలాచేశాను."

"మంచిపని చేశారు. మా డ్రైవర్ కూడ కుట్రకు లోబడ్డాడే."

"ఎవర్నీ నమ్మగూడదండీ ఈ రోజుల్లో!"

"నిజం చెప్పారు. ఆ, మీదేవూరు?"

"ఒక పల్లెటూరు...."

"మీ పేరు?"

"ఆనంద్."

"ఇక్కడ చదువుతున్నారా?"

"లేదండి."

"మరి దేనికోసం వచ్చారు?"

"ఉద్యోగం కోసం."

"అయితే వుద్యోగం చేస్తున్నారా?"

"లేదండి. వుద్యోగమే వుంటే యిలా తిరగడం దేనికి? ఎంత తిరిగినా వుద్యోగం దొరకలేదు. దొరుకుతుందన్న ఆశకూడా నాలోనశించింది. ఇప్పటికి వారంరోజులనుంచీ తిరుగుతున్నాను. లాభంశూన్యం. చివరికి ఏదో కంపెనీలో అవకాశం వుందంటే ఆశచేత వెళ్ళాను. అక్కడా

చుక్కెదురైంది. నిరాశలో తిరిగి వస్తున్నాను. ఇంతలో ఈ సంఘటన ఎదురైంది."

"మీరెంతవరకు చదివారు?"

"ఈ కాలంలో ఎంత చదివినా లాభం శూన్యం, బి. ఏ. ఫస్టు క్లాస్‌లో ప్యాసయ్యాను."

"బి. ఏ. ప్యాసయ్యారా?"

"అవునండి."

"మీ తల్లిదండ్రులు మీ వూళ్ళోనే వున్నారా?"

"లేరండి. అందరూ నన్ను విడిచివెళ్ళిపోయారు. ఈ ప్రపంచంలో నావారంటూ ఎవరూ లేరు. ఈ ప్రపంచంలో నేను ఏకాకిని."

"మీరు ఉద్యోగం కోసం ఇంతదూరం రావలసిన పనేముంది? మీ వూరు చాల దూరమని చెప్తున్నారు మరి!"

"అక్కడ, వుద్యోగం దొరక్కనేకదా యిలా బయలుదేరాను! సిఫారసులువుంటే అక్కడే స్థిరపడిపోయేవాడ్నికదా! నాకు సిఫారసులు లేవు. నాకు అండాదండగా నిలిచేవారెవ్వరూ లేరు, బి.ఏ డిగ్రీకి విలువా లేదు, ఫస్టుక్లాస్‌లో ప్యాసయ్యానన్న ఆశతో ఏదోఒకటి దొరుకుతుం దన్న నమ్మకంతో పట్నంచేరాను." అన్నాడానంద్.

రాఘవరావుగారిక అతన్నేమీ అడగలేదు? అతనిపరిస్థితులెంత దుస్థితిలోవున్నాయో తెల్సుకున్నాడు రాఘవరావుగారు. ఆయన కెంతో జాలి కలిగింది.

పోలీసుస్టేషన్‌లోపని పూర్తిచేసుకొని ఇద్దరూ కారెక్కారు. కారు సరాసరివచ్చి గేటుముందాగింది. వెనువెంటనే ఆనంద్ గుండె లవిసిపోయాయి. అతని ప్రాణాలు మబ్బుల్లోకానికెగిరాయి. భ్రమపడ్డా నేమోనని తేరిపార చూశాడు. అదే ఘ్రాళతీలత పెనవేసుకున్నగేటు.

అదే మేడ. 'చచ్చాంరా భగవాన్!' అనుకున్నాడు తనలో తాను. గేటు తెరువబడింది. కారు షెడ్డులోకివెళ్ళి ఆగింది. ఇద్దరూ దిగారు. ఆనంద్ గుండెలు దడదడలాడుతున్నాయి. అప్రయత్నంగా "నేనువెళ్ళొస్తానండి" అన్నాడు.

"ఇది చాలబాగుంది. ఇంటిఆవరణలోకివచ్చి ఇంట్లోకిరాకుండా వెడతారా?" అన్నాడాయన.

"ఫరవాలేదులెండి. నే వెళ్ళొస్తాను నాకు చాలపనివుంది."

"నో. నో. ముందుమీరు రావాలి" అంటూ అతనిభుజంమీద చెయ్యివేసి ముందుకు సాగాడు.

గుండెదడదడా కొట్టుకుంటోంది ఆనంద్ కి. ఇద్దరూ లోపలికి వచ్చారు. సోఫాల్లో కూర్చున్నారు. రాఘవరావుగారు పనిమనిషి చంద్రయ్యకేసి చూస్తూ "అమ్మాయి ఎక్కడికి వెళ్ళిం"దని ప్రశ్నించారు. మీకోసం చాలసేపుచూసి నాటకానికి వెళ్ళిపోయారని చెప్పాడు పనిమనిషి. రాఘవరావుగారు, ఆనంద్ మాట్లాడుకొంటూకూర్చున్నారు. ఆ తరువాత యిద్దరూ భోజనంచేసి కూర్చున్నారు.

"మీవుపకారానికి ప్రత్యుపకారం ఏమీచేయలేనండి. మీఋణం ఈ జన్మలోనే తీర్చుకోలేను. మీకు నేను చాలా ఋణపడివున్నాను" అన్నాడాయన.

"పెద్దవారు మీరుకూడ అలాఅంటున్నారా! అటువంటి పరిస్థితుల్లో ఎవరైనా అడ్డుపడకతప్పదు. అది మానవకర్తవ్యం"

"మీరుచేసిన సహాయానికి ప్రతిసహాయం నేనేంచేయలేను. కాని నాకు చేతనైందేదో చేయగలను. మా ఫ్యాక్టరీలో రేపటినుంచి మేనేజరుగా వుండండి." ఆనంద్ హృదయంలో ఆనందరాగాలు ఆలపించాయి.

"చాలా సంతోషంసార్. ఏమిఫ్యాక్టరీఅండి?"

"పింగాణిఫ్యాక్టరీ."

"చాలా అదృష్టవంతుణ్ణి."

"రేపటినుండి మీపనిమీరు చూచుకోవచ్చు. పోతే ఇప్పటివరకు నేనిర్వహిస్తున్న ఆపదవిని మీరుస్వీకరించాలి. ఏమంటారు?"

"యింకే మంటాను? నా అదృష్టమంటాను."

"మీ ఖర్చు ఎంతయితే అంతా మేము భరించుకుంటాము. మీకెంత ఖర్చు అవుతుందో సుమారుగా చెప్పగలరా?"

"వంటరివాణ్ణి. నా కెంతయినా సరిపోతుంది."

"సరే, అయితే రెండు వందలు." అన్నా డాయన. ఆనంద్ తారా పథంలో విహరిస్తున్నాడు.

"మీరు రేపు వచ్చిచేరండి. మీకు కావల్సినవాటికోసం యిది వుపయోగించండి" అంటూ ఐదునోట్లు తీసి అందించ బోయారు.

"అయిదు వందలు నాకెందుకండీ. ఒక నెల జీతం మాత్రం ముందు తీసుకుంటాను" అంటూ రెండు కాగితాలు తీసుకొన్నాడు.

"ఫరవాలేదు. తీసుకోండి."

ఆనంద్ ఆయన ముఖాన్ని చూచి మెదలకుండా తీసికొన్నా డైదుకాగితాలు.

"మీరు పట్నంలో వుంటారా? బయటవున్నా ఫరవాలేదా?" అని ప్రశ్నించాడు రాఘవరావుగారు.

"ఫ్యాక్టరీకి దగ్గరలో అయితే బాగుంటుందని అనుకుంటున్నాను. ఏదైనా యిల్లు అక్కడే చూచుకోవాలని వుంది."

"అయితే మరీ మంచిది. ఫ్యాక్టరీ ఆవరణలో చిన్న డాబావుంది. మా ఫ్యాక్టరీకి సంబంధించిన వారికి బస అక్కడ ఏర్పాటు చేసేవాళ్ళం.

అది ఖాళీగానేవుంది. మీరు దానిలో వుండండి. బాధలేకుండా వుంటుంది."

"చాలా సంతోషమండి. ఇక నే వెళ్లొస్తాను." అంటూ లేచాడు.

మాలతి వస్తుందేమోనని భయం; పైగా మధ్యాహ్నం సాయంత్రం వస్తానని అబద్ధం చెప్పాడాయె. అటువంటప్పుడతని కక్కడెలా నిలువ బుద్ధి పుడుతుంది ?

"మంచిది." అంటూ లేచా రాయనకూడ.

"నమస్తే." అన్నా డానంద్.

"నమస్తే" అన్నా డాయన.

మరుక్షణం ఆనంద్ ఆ మేడను విడిచి బయట కొచ్చాడు.

రాఘవరావుగారు సోఫాలో కూర్చొని కూతురు కోసం నిరీక్షిస్తున్నారు.

"అతనెవరండీ ? ఎప్పటినుండో మాట్లాడుతూ కూర్చున్నారు ? ఎవరైనా ఆఫీసరా ఏమిటండీ ?" అంటూ వచ్చి కూర్చుంది సావిత్రమ్మ.

"ఆఫీసరు కాదు. ఆప్తమిత్రుడు."

"మీ వయసెక్కడ ? అతని వయసెక్కడ ? అతను మీ స్నేహితు డేమిటండీ ?"

"దేవుడిలా వచ్చాడు, నా ప్రాణాలు రక్షించాడు." అంటూండగానే మాలతి వచ్చింది. వస్తూనే,

"వస్తానని రాలేదేం నాన్నా ?" అంది.

"ఈనాటితో మీనాన్న యింటికసలువచ్చేవాడేకాదమ్మా ! అతను రాకపోతే ఈపాటికి ఈ జగతిలో సమాధి అయిపోయివుండేవాణ్ణి."

"ఏమిటినాన్న ? అవేంమాటలు ?"

"ఏమీలేదమ్మా" అంటూ అంతా చెప్పుకొచ్చాడాయన.

"అతని పేరేమిటి? ఆనందా?" అంది. ఆమెవదనంలో వేయి జ్యోతుల తేజస్సు వుట్టిపడుతోందాక్షణాన.

"అవునమ్మా."

"మొన్న రైల్వేస్టేషనులో నాకు సహాయపడ్డారని చెప్పలేదూ? ఆయనీరోజు మధ్యాహ్నం వచ్చారునాన్నా! మళ్ళీ సాయంత్రం వస్తా నన్నారు. రాలేదు."

"అంటే, అతనే యితనేమోనని అనుమానమా?"

"అనే అనిపిస్తోంది, అతనిపేరూ ఆనందే"

"అయితే సందేహం అనవసరంఅమ్మా. ఆ ఆనంద్ కాదమ్మా ఈ ఆనంద్. ఇంతవరదాకా యిక్కడేఉన్నాడు, మాటమాత్రమైనా చెప్పడా ఒకసారిక్కడకు వచ్చానని. పైగా, అతనిక్కడికి రావటంఇదేప్రథమం. మేడ చాలా బాగుందన్నాడు"

"అయితే అతను నిన్ను బాగాఎరుగున్నాడా?"

"ఆ అతనిక్కడ కాఫీకూడ తీసికొనివెళ్ళారునాన్నా" అంటూ అంతా చెప్పుకువచ్చింది.

"అయితే ముమ్మాటికి అతను కాదమ్మా. సందేహమేలేదు."

"అయితే ఇంకెవరోలే," అందామె. నిరుత్సాహాన్ని ప్రకటిస్తోం దామె వదనం, ఏమైనా ఈ రోజు అదృష్టవంతులం అను కొంది మాలతి తండ్రివైపు చూస్తూ.

౪

రెండు నెలలు గడచిపోయాయి. ఆనంద్ జీవితం సుఖంగానే సాగిపోతూంది. అతనికి ఫ్యాక్టరీపని హాయిగానేవుంది. జీవితం హాయి గానే నడచిపోతుందని దృఢనిశ్చయం చేసికొన్నాడు. పైగా ఫ్యాక్టరీలో

పనివాళ్ళందరు ఆనంద్ అంటే అతి శ్రద్ధాభక్తులు చూపిస్తున్నారు. అతను తమపాలిట దైవంగానే భావిస్తున్నారని చెప్పక తప్పదు కొన్ని సమయాల్లో. ఈ రెండు నెలలలోను ఆనంద్ పనివాళ్ళకెంతో సాయం చేశాడు. వారి పిల్లల భావిజీవితం సుఖమయం కావాలన్న సదుద్దేశంతో వారికి చదువు చెప్పటంకోసం యేర్పాట్లు చేయించాడు. ఆనంద్ వచ్చిన తరువాత పనివారి కష్టసుఖాలు తానే స్వయంగా తెలుసుకుంటూ వుండేవాడు. ఆనంద్ వారిపాలిట దైవమని మరి వేరే చెప్పాలా!........అలా అతని జీవితం నిరాడంబరంగా సాగిపోతోంది.

ఆ రోజు శనివారం. సాయంత్రం ఆరుగంటలయింది. ఆనంద్ బసకువచ్చి స్నానం ముగించి సోఫాగా కూర్చున్నాడు. భోజనం తేవటానికి హోటలుకెళ్ళిన రాము ఇంకారాలేదు. అంతలో రాఘవరావుగారొచ్చారు. లేవబోయాడానంద్.

"ఫర్వాలేదు కూర్చోవోయి! ఆఫీసుపోల్సు ప్రతిచోటా అమలు జరపాలాఏం?" అంటూ నవ్వారాయన సోఫాలో కూర్చుంటూ.

ఆనంద్ చిన్నగానవ్వి ఆయనవైపు చూస్తున్నాడు,

"ఇదిగో, ఆనంద్! నీకోవిషయం చెప్పాలని వచ్చాను. రేపు మా అమ్మాయి పుట్టినరోజు. తప్పకుండా రావాలి." అన్నాడాయన.

'చచ్చాంరాభగవాన్' అనుకొని "నాకు కొంచెం పనుందండీ!"

"ఏంపనోయ్? ఏపనివున్నాసరే రేపు రాకతప్పదు."

"రేపు ఆదివారమని ప్రయాణం పెట్టుకున్నాను."

"ఎల్లుండి వెళ్ళవచ్చు. ఏం ఫరవాలేదు."

"సర్లెండి" అన్నాడానంద్.

"అయితే నేవస్తాను" అంటూ లేచారాయన.

అతనుకూడా లేచి ఆయన్ననుసరించాడు. ఆలోచిస్తూ వెళ్ళిపోయే రాఘవరావుగార్ని చూస్తూ నిలబడ్డాడు ఆనంద్.

ఆరాత్రి నిద్దురపట్టలేదు. తెల్లవారింది. ఏమిటో అగమ్యగోచరంగా వుంది. అన్నంకూడ తినబుద్ధి పుట్టలేదు. ఆలోచనతోనే సాగిపోయింది కాలం. సాయంత్రం నాలుగుంపావు అయింది. చరచరానడిచి జీపు దగ్గరకు వెళ్ళి జీపులో కూచొని స్టార్ట్‌చేశాడు. జీపు శరవేగంతో సాగింది, దిగి ముందుకు సాగాడు. గుండెలు దడ దడ లాడుతున్నాయి, అతని రాకగమనించి రాఘవరావుగారు విందులోవున్నా లేచివస్తున్నారు. అదే సమయంలో మాలతికూడ లేచివస్తూంది. ఆమె ఎంతో ఆనందించింది. అనుకొనీ అనుకోకుండా ఆనంద్ రావటం ఆమెకెంతో సంబరమనిపించింది.

"రావోయి ఆనంద్! రా. రా." అంటూ సమీపించాడు రాఘవరావుగారు.

వచ్చే మాలతిని చూచాడు. గుండె ఒక్కుక్కుమంది ఆనంద్‌కి.

"ఏం మిష్టర్, దర్శనాలేలేవు" అంది చిరునవ్వుతో.

"యితనేనా మాలతీ?" కూతురువైపు చూస్తూ అన్నాడు రాఘవరావుగారు.

"అవును నాన్నా." అంటూ ఆనంద్‌కేసి చూస్తోంది,

"ఏమిటోయి ఆనంద్!" అతని మొగంలోకి సూటిగా చూస్తూ అన్నారు రాఘవరావుగారు.

"చెప్పండి మేనేజర్‌గారూ" అంది చిన్నగా నవ్వుతూ.

"తరువాత చూడుకోవచ్చులే, ముందు పదండి" అంటూ నడిచాడాయన.

విందయిపోయింది. నాట్యాలు వగైరా ప్రోగ్రాములుకూడ పూర్తయ్యేసరికి 8-30 గంటలయింది, అందరూ వెళ్ళిపోయారు. తోటి స్నేహితులలో మాట్లాడుతూ కూర్చున్నాడు రాఘవరావుగారు. అదను చూచుకొని ఆనంద్‌ను సమీపించి అతనివైపుకు చూస్తూ "ఒకసారి పైకొస్తారా ?" అంది మాలతి.

అతనేం సమాధానమివ్వలేదు.

"అడిగితే జవాబివ్వకుండా నాట్యంచేస్తారేం ? రండి" అంటూ ముందుకుసాగింది. ఆమెను అనుసరించాడతను. ఇద్దరూ గదిలోకివచ్చారు. ఒకరి కెదురుగా ఒకరు కూర్చున్నారు సోఫాల్లో.

ఆమె అతనివైపు చూస్తూ-

"ఆనాడు వస్తాననిచెప్పి మళ్ళీ రాలేదేమండీ" అంది. ఆనంద్ గుటకలు మ్రింగడం మొదలుపెట్టాడు.

"మంచినీళ్ళు కావాలా మిష్టర్ ?" హాస్యధోరణిలో అంది ఆమె అతనిముఖాన్ని తిలకిస్తూ.

"వుంటే యిప్పించండి." అన్నాడు ముక్తసరిగా. మాలతి లేచి వెళ్ళి ప్రక్కగా ఉన్న చిన్నకూజానందుకొని గ్లాసుఅక్కడేవుంచి కూజా అందించింది, కూజానందుకొని గటగటాత్రాగివేసి ఖాళీకూజాను క్రింద పెట్టాడు ఊపుతూ.

"ఇంకా తెమ్మంటారా ?"

"తెప్పించండి."

కూజాతీసికొని క్రిందకువెళ్ళటానికి సంసిద్ధమయింది.

"చాల్లెండి. పాపం శ్రమిచ్చాను." అన్నాడానంద్.

కూజా ప్రక్కన పెట్టి అతనికెదురుగా ఉన్న సోఫాలో కూర్చొని "యిప్పుడు చెప్పండి" అంటూ అతని ముఖంలోకి చూసింది,

"ఏం చెప్ప మంటారు?" వింతగా ప్రశ్నించాడతను.

"అసలు విషయం చెప్పకుండా ఏమిటండి ఇదంతా."

"ఏమీలేదండి."

"ఏమీ లేకుంటే ఎందుకు రాలేదు వస్తానని."

"ఊరకనే."

"ఏమిటండీ. హాస్యానికి అంతంలేదా!"

"మీరడిగేదేమిటి? ఎందుకు రాలేదనేగా."

"అవును."

"నే రా లేదనుకోవాల్సిన పనేముంది?"

ఆమెగుండె లవిసిపోయాయి. ఆమె అతనివైపు చూస్తూ "పనుంది కాబట్టే" అంది.

"దయవుంచి నాగురించి. ఏమీ ఆలోచించకుండా వుండటం మంచిది."

"మిష్టర్!" అంటుండగానే ఆమెవదనం విస్ఫారమయింది.

"అవునండి, నేనెంత మానసిక బాధ ననుభవిస్తున్నానో మీకు తెలియదు. వస్తానని రానందుకు నేనెంతో విచారించాను. నేను వస్తే ఎలా పరిణమిస్తుందోకూడ నాకు తెలుసు. అందుకే రాలేకపోయాను. ఇంతకీ ఆ రోజు రైల్వేస్టేషన్‌లో సంఘటనతెచ్చిం దీసంకటకొలువు."

ఆమె తలవంగిపోయింది. కన్నులలో నీరు నిండింది. వంచిన తల పైకిఎత్తనైనా ఎత్తలేదు.

"క్షమించండి. అలా అన్నందుకు ఏమీ అనుకోకండి. నా బాధ నాది. నా బాధ మీకర్థంకాదు. దయవుంచి నాగురించి ఆలోచించకుండా వుంటే చాలాసంతోషిస్తాను. వస్తాను." అంటూ చరాచరాదిగివెళ్ళి పోయాడు.

ఇంతవరదాకా రాఘవరావుగారు వారి సంభాషణంతావిని ఆనంద్ బయటకు రాకముసుపే క్రింద కొచ్చేశాడు. ఆనంద్ రాఘవరావుగారిని సమీపించి.

"నే వస్తానండీ" అన్నాడు.

అతనివదనం ఆదోమాదిరిగా వుంది.

"నేనూ వస్తానుండు" అంటూ లోపలికెళ్లి మరో రెండు నిమిషాల్లో వచ్చారు రాఘవరావుగారు. వచ్చి ఇద్దరు కలసి బయటి కొచ్చారు. రాఘవరావుగారు చిన్నకారులో కూర్చున్నారు. ఆనంద్ జీపు ఎక్కాడు. మరుక్షణం రెండూ కదిలాయి. రెండూ ఫ్యాక్టరీ ఆవరణలో కొచ్చి ఆగాయి. ఇద్దరూ వాదాలో కూర్చున్నారు.

"ఆనంద్! నీతో ఒక ముఖ్య విషయం మాట్లాడాలి." ఆనంద్ వైపు చూస్తూ అన్నాడు.

"ఏమిటండీ?"

"మా అమ్మాయిని నీవు ప్రేమిస్తున్నావా?"

ఆనంద్‌ను యీ ప్రశ్న తికమకలు పెట్టింది. ఆయనవంక చూస్తూ యిలా అడిగాడేమిటా యని తనలో తను అనుకొంటూ "లేదండి." అన్నాడు.

"నిజంచెప్పు."

"నిజమే చెప్తున్నాను."

"అయితే ఎందుకు ప్రేమించలేక పోతున్నావ్?"

"నా పరిస్థితులలా వున్నాయి."

"ఆర్థికంగానా?"

"కాదు. మానసికంగా."

స్వరం కొంచెం తగ్గింది.

"ఏమిటో అది?"

"క్షమించండి. ఇప్పుడు చెప్పలేను."

"నీవు ప్రేమించక పోయినా నిన్ను మా అమ్మాయి ప్రేమించిందనుకుంటున్నాను. ఏమంటావ్?"

"యథార్థ మంటాను."

"అయితే. మా అమ్మాయినిగురించి చిన్నత్యాగం చెయ్యగలవా?"

"ఏమైనా చేస్తాను."

"అయితే, ఆ మమకారం దేనికి?"

"ఏమో. ఆ భగవంతునికే తెలియాలి."

"నిజంగా త్యాగం చెయ్యగలవా?"

"ఆ."

"ఈ మాటలు జాగర్తగా విను ఆనంద్. మా కుటుంబంలో పరిస్థితులెలావున్నాయో నీకు తెలియదు. ఇంట్లో యీగలమోత బయట పల్లకీలమోతలాగవున్నది నా పరిస్థితి. నా బాధ అర్థంచేసికొనే వారెవ్వరు లేరు. సమయం వచ్చింది కనుక చెప్పక తప్పలేదునీతో, మాలతి సుఖం నీవు మనస్పూర్తిగా కోరేవాడవయితే తెల్లవారే టప్పటికి పట్నం వదలి నీవు వెళ్ళిపోవాలి."

"ఆఁ;"

ఆయనన్న మరుక్షణం ఆనంద్ ముఖం నల్లబడింది.

"వెళ్ళలేవా ఆనంద్? నా గుండెకోత నీకెలా తెలుస్తుంది?"

"వెళ్తాను. మరి కాస్సేపట్లో ఈ పట్నాన్ని వదలి వెళ్ళిపోతాను. తప్పకుండా వెళ్ళిపోతాను. ఆ మాటలు ఆతని స్వరంలోనుండి ఎంతో ఖారంగా వచ్చాయి.

"ఇది నీ దగ్గరవుంచు, అంటూ పది కట్టలుతీసి అతని కందివ్వబోయాడు."

"ఇదేమిటండీ?"

"ఉంచు ఆనంద్."

"క్షమించండి."

"నా మాట దక్కించలేవా ఆనంద్? నీవు తీసికోకుంటే నాకు శాంతివుండదు," ఆయన ఎంతో బాధతో అన్నా రా మాటలు.

"అనవసరంగా నాకెందు కండీ?"

"ఏది అనవసరం ఆనంద్? నాబాధ అర్థం చేసి కోలేవా? అయితే నా ప్రాణాలు దక్కించటంకూడ అనవసరమే. నేనీనాడు నిన్ను ఎందుకు వెళ్ళమంటున్నానో నీకుతెలియదు. ఈసమయంలో నేనెంత బాధ పడుతున్నానో ఆ భగవంతుడికి తెలియాలి. ఏ ప్రాణాలు నిల బెట్టావో ఆప్రాణాలు తీసి వెళ్ళు ఆనంద్!" ఆయన నోటి నుండి గంభీరంగా వచ్చా యీ మాటలు.

ఆయన ము న్ని తిలకించాడు. ఆయన నయనాలు అశ్రు పూరితాలయ్యాయి. ఆయన కన్నీటి బిందువులను ఆనంద్ చూడటం ఇదే మొదటి సారి. అప్రయత్నంగా ఆయన చేతిలోని డబ్బును తనచేతిలోకి తీసికొని-

"తీసికొన్నా నండి. తీసికొన్నాను." అతనిస్వరంలో ఏదో మార్పు కనిపించింది.

రాఘవరావుగారు బాధగా ఆనంద్ వైపు చూస్తూ "నన్ను మర్చిపోతావా ఆనంద్?" అని దీనంగా అడిగాడు పిల్లవాడిలా.

"నాగుండె కొట్టుకున్నంతకాలం మిమ్మల్ని మర్చిపోగలనా." అన్నాడానంద్.

వెనువెంటనే రాఘవరావుగారు సోఫాలోనుండిలేచి "వస్తానానంద్" అంటూ ముందుకు సాగారు.

ఆనంద్ చూస్తూ నిల్చుండిపోయాడు. అతని మస్తిష్కం అట్టుడికి నట్టుడికి పోతూంది. ఆయన ఎందుకలా చెప్పారో, తను పట్నం విడిచి వెళ్ళి పోవటంవల్ల లాభమేమిటో, అసలింతటి విషమ పరిస్థితు లెందుకు సంభవించాయో అతని కర్థంగాలేదు. కాని, కనులనుండి రెండు నీటి బిందువులు మాత్రం రాలాయి. ఆఖరుసారి ఆయనతో ఆనంద్ ఏదో అన్నాడు. ఆయన సరే నన్నాడు. ఆ మరుక్షణం ఆ ప్రదేశంనుండి సాగిపోయింది చిన్నకారు. అలా చుస్తూ నిల్చుండి పోయాడు ఆనంద్ కారు కనుపడినంతవరకు.

రాఘవరావుగారు సరాసరివచ్చి తన గదిలో ఆలోచిస్తూ పడు కున్నాడు. ఆయన యేలోకంలోనో విహరిస్తున్నాడు. ఆనంద్ విషయం ఆయన హృదయాంతరాళాలలో అగ్ని జ్వాలలు ప్రజ్వలింపజేసాయి. రాఘవరావుగారు ఆనంద్ విషయంలో ఎంతబాధపడుతున్నాడో వివ రించడం చాలకష్టం. ఆయన ఆజన్మాంతం మరపురాని వ్యక్తి ఆనంద్. ప్రాణ భిక్ష పెట్టిన ఆ జీవిని తనేస్వయంగా పట్నం విడిచి పొమన్నాడు. ఆ విషయం ఆయన్ని మరింత వేధించసాగింది. అందరిచేత 'పెబాస్' అనిపించుతున్న కార్యశూరుడు. అందరి ప్రేమకుపాత్రుడైనయోగ్యుడు. తను వున్నా లేకపోయిన తనదిగానే భావించి కార్యాన్ని చక్కబెట్టగల అనుభవజ్ఞుడు. వాస్తవంగా ఆలోచిస్తే ఆనంద్‌వచ్చిన తర్వాత ఫ్యాక్టరీ తీరే మారింది. కూలీలు ఎంత చక్కగా పనిచేస్తున్నారో చెప్పలేం, ఆనంద్ అంటే వారికెంత మంచి అభిప్రాయముందో చెప్పలేం. అందరి

కష్ట సుఖాలు స్వయంగా అతనే ఆలోచిస్తూవుండేవాడు. అటువంటి యోగ్యుడు, కార్యశూరుడు,ధీమంతుడు, వెళ్ళిపోవలసి వస్తోందిప్పుడు. ఏది ఏమైనా రాఘవరావుగారు చాల బాధపడుతున్నారని చెప్పకతప్పదు. పరిస్థితులెంత విచిత్రంగా అధికారాన్ని చెలాయిస్తాయో మానవుడి మీద! ఒక్క క్షణంలో యెలా రూపొందుతుందో మనకగమ్య గోచరంగదా!

రాఘవరావుగారు ఆనంద్‌ని గురించే ఆలోచిస్తున్నారు. సావిత్రమ్మ వచ్చిందాగదికి. భర్తను చూచింది. ఏవో ప్రశ్నల వర్షం కురిపించింది. ఆయన ఏవో సమాధానాలు ఇస్తున్నాడు, వాళ్ళిద్దరిమధ్యా మాటలిలా సాగుతున్నాయి.

"మళ్ళీ ఎక్కడికి కెళ్ళారండీ?" అని ప్రశ్నించిందామె.

"ఏదో పనుండి వెళ్ళాను"

"అదేమిటండీ? ముఖము అలావుందేం!"

"ఏదో ఆలోచిస్తున్నాను."

"ఎప్పుడూ ఆలోచిస్తూనే వుంటారు. ఎప్పుడూ ఏదో ఒకగొడవేనాయె. ఎప్పుడూ మీ గొడవ మీదే గాని ఇంట్లో గొడవను పట్టించుకోనే పట్టించుకోరాయె. ఈ రోజుల్లో దానికి 20 సంవత్సరాలునిండినా మీలో దాని పెండ్లి విషయం మొలకెత్తలేదు. నలుగురూ ఏమనుకుంటున్నారో ఆలోచించనన్నా ఆలోచించరు."

"నేను ఆ విషయమే ఆలోచిస్తున్నాను."

"ఆ. మీరెప్పుడూ ఆలోచిస్తూనే ఉంటారు." మాటను విరిచినట్లు మాట్లాడింది.

"అది కాదే! ఈ సంవత్సరం పెండ్లిచేసి తీరుతాను."

"అయితే, పెండ్లి కొడుకు ఎవరోమరి?" ఆయన మొగముకేసి చూస్తూ ప్రశ్నించింది.

కొన్ని క్షణాలు నిశ్శబ్దంగా సాగిపోయాయి.

"ఇంకా ఆలోచిస్తారేమిటండీ? మీ ఆలోచన నాకు తెలియనిదా? ఎందుకండీ అంతపగ. ఇంత పట్టుదలైతే బ్రతికేదెల్లాగండీ? చూస్తూ చూస్తూ వుండగానే 21 సంవత్సరాలు గడచిపోయాయి. అన్నా చెల్లెలు అన్న ముచ్చటేలేదు. మీకు మేనల్లుడుపుట్టాడని తెలిసికూడ వెళ్ళలేదు. ఎప్పుడూ అనలేకపోయాను. ఇప్పుడు సమయం వచ్చిందికనుక అన వలసి వచ్చింది. ఎన్నిజరిగినా మనలోమనకిన్ని కోపతాపాలు అయితే ఎలాగండీ! అయినవాళ్ళని కాదని కానివాళ్ళని కోరితెచ్చుకోవడం దేనికండీ? ఎన్ని పగలుంటేమాత్రం యింతదారుణంగావుండటం న్యాయంగా వుందా? దానికింతవరకూ ఈ సంగతి చెప్పనేలేదు. దానికీ మేనత్తవుందనీ, బావవున్నాడని తెలిస్తే అది ఎంత బాధపడుతుందో ఆలో చించారా? మాట్లాడరేమండి?" ఈమాటలు కొంచెం ఆవేశపూరితంగానే వచ్చాయి ఆమెనోట.

"యిన్ని సంవత్సరాల అనంతరం నేను వెళ్ళాలా సావిత్రీ?" బాధపడుతూనే అన్నాడాయన.

"మీ మతంమీదేకాని ఆమె తప్పేముందండీ? అత్తగారు మీకు మాటా మాటా అనుకున్నారు. ఆమె మాటే నెగ్గింది? అయితే మాత్రం యేం? ఆమె పెద్దది. ఆమె యిష్టం ప్రకారం జరగడం న్యాయమేనని చెప్పకతప్పదు. ఆనాడా వయస్సులో అంత రాద్ధాంతం చేశారు. కాని నే చెప్పుతూ ఈ ప్రస్తావన ఎత్తేవాన్నికాదు. ఆ తరువాత ఈ పట్నానికి వచ్చి మన గొడవలో మనం మునిగి తేలుతున్నాం. అదృష్టం బాగుంది. కలిసొచ్చింది. బాగుపడ్డాం. కాని లాభమేముందో నాకేం తెలియటం లా

లేదు. ఆనాడు కొద్ది డబ్బుతో వచ్చాం. ఈనాడిలా వున్నాం. ఈ ఆస్తంతా పరాయివాడికి ధారపోసే కంటే గతాన్ని మరచి ముందుదారి చూస్తేం మంచి దనిపిస్తూంది."

"సరే. సావిత్రీ. నీ సలహా తప్పకుండా వింటున్నాను. రేపు ప్రొద్దున ప్రయాణమై వెళ్తాను. వాణ్ణి తప్పకుండా తీసుకువస్తాను. నాకంటే నీవేనయం. అన్ని విషయాలు ఆలోచించగల్గావు. తప్పునాదని నాకు తెలుసు, కాని అభిమానం అడ్డం వచ్చింది. సావిత్రీ. ఈసారి నీ మాట తప్పక వింటాను."

"ఈ ఆలోచన యిదివరకే వుంటే ఎంత అందంగావుండేది? ఎంత ఆనందంగా వుండేది?"

"ఖర్మ సావిత్రీ? ఖర్మ. విధిని ధిక్కరించగలవాడెవ్వడూలేడు, ఆ ప్రస్తావన ఎత్తితేనే కస్సుమంటూ లేచేవాణ్ని. కాని ఈ నాడు నీ మాట ఎందుకువింటున్నానో ఆలోచించు. ఏదైనాఅంతే. కాలంకలిసి వచ్చేదాకా ఖర్మ చలాయించే అధికారానికి మనం దాసులమై పోక తప్పదు.

అంతలో టెలిఫోను మ్రోగింది. ఆయన గుండె దడదడలాడింది. ఆయన ఆత్రంగా ఆమెవైపుచూస్తూ కొంచెం కాఫీ తీసుకురా త్వరగా అన్నాడప్రయత్నంగా. వెంటనే ఆమె వెళ్ళిపోయింది. వెంటనేలేచి రిసీవర్ అందుకున్నాడు. కొన్ని క్షణాలు మాట్లాడుకున్నారు. ఆమాటల తీరుచూస్తే అవతల మాట్లాడేది ఆనంద్ అనే బోధపడుతూంది. రిసీవరు క్రింద పెట్టాడు. ఆయన కనుకొలుకులనుండి అశ్రుబిందువులు రాలుతున్నాయి. పైకండువాతో కన్నీరొత్తుకొని అక్కడనుండి యివతల కొచ్చేశాడు. అంతలో సావిత్రమ్మ వచ్చింది. కాఫీ త్రాగడం పూర్తయింది.

"దానికీ విషయం తెలిస్తే ఎంతబాధపడుతుందో!" ........ అనలేక అంది ఆయనవైపు చూస్తూ.

మరి కాస్సేపు ఇద్దరూ మాట్లాడు కున్నారు, సావిత్రమ్మ వెళ్ళిపోయింది. ఆయనలేచి కూతురు గదికేసి నడిచారు. ఆయన మనస్సు మరిగిపోతూందాక్షణాన. ఎన్నో ఆలోచనలు ఆయన్ని వేధించసాగాయి. తన మటుకు తనకే అసహ్యమేస్తోంది తన ప్రవర్తన. అలా ఆలోచించుకుంటూ కూతురు గదికి వచ్చాడు. నిలబడికూతురుకేసి చూస్తున్నాడు.

మంచం మీద పడుకొని కిటికీంలోంచి శూన్యంలోకి చూస్తోందామె. ఆమె యెంతబాధపడుతూందో ఆయనకు తెలీదు. ఆమె మనస్సు మరిగి ఆవిరయి పోతోంది. ఆనంద్ ఎందుకలా ప్రవర్తించాడో అసలు అతను ఎందుకు తన్ను తిరస్కరించాడో అన్నసమస్యలు ఆమెను వేధించసాగాయి. అసలతను ఎందుకు తన్నుప్రేమించ లేకపోయాడన్నది ఒక జటిల సమస్యయి కూర్చుంది ఆమెకు. అంతలో,

"మాలతీ" అని పిలచాడాయన,

"ఏమిటినాన్నా?" అంటూ ఉలిక్కిపడి లేచింది.

"ఏమిలేదమ్మా. ఏమిటో ఆలోచిస్తున్నట్టున్నావ్?"

"ఏమీలేదు." నిస్సారంగా వెలువడిం దామాట ఆమెనోటినుండి.

"అలావున్నావేం!" అంటూ కూర్చున్నాడాయన.

"ఏమీలేదు నాన్నా!" అంటూ ఆమెకూడ కూర్చుంది.

"ఈరోజు నీస్నేహితులంతా వచ్చారుకదూ,"

"అందరూవచ్చారు"

"...... .... .... .... .... ...."

"ఆరోజు ఆనందే అంటే కాదన్నారు. ఫ్యాక్టరీలో నాకు తెలియకుండానే రెండు నెలలబట్టీ పనిచేస్తున్నారాయన."

"అతనెందుకలా నటించాడో నాకప్పటికీ ఇప్పటికీ అర్థమే కాలేదు. అతను అంతకుముందు ఒకసారికూడా నాతో మాటమాత్రమైనా అనలేదు." అలా అతన్ని గురించి కాసేపు మాట్లాడుకున్నారు. అతని విషయాలు చాలవరకు తెలుసుకుందామె. కాసేపు నిశ్శబ్దంగా సాగిపోయిందికాలం. మళ్ళీ మరోవిషయాన్నిగూర్చి ఆలోచిస్తూ మార్చున్నారు ఆయన చాలాబాధతో చెప్పుకొచ్చాడు. ఆమెవింటూ ఆశ్చర్యచకితురాలైంది. ఆయన్ని చూస్తూ చాలా బాధపడిందామె. కాని చేయగలిగిందేమీలేదు. చేతులు కాలినపిదప ఆకులుపట్టుకుంటే లాభంఏముంది? ఎంతో బాధపడుతూ;

"నాకెప్పుడూ చెప్పలేదేంనాన్నా?" అని అడిగింది.

ఆయనేం మాట్లాడలేదు.

"నాకు మేనత్తా, బావా ఉన్నారా?" అంది మాలతి.

"ఊఁ. ఉన్నారమ్మా ఉన్నారు. ఈ కసాయి మూలాన సంబంధం లేకుండా దూరంగా వున్నారు. నా ఆత్మాభిమానం వాళ్ళను దూరం జేసింది. నా పట్టుదల సంబంధబాంధవ్యాలన్నిటిని తెంపివేసింది.

"25 సంవత్సరాల వరకూనాన్నా? అత్తయ్యకూడ అంతపట్టెందుకు పట్టింది?"

"దాని తప్పులేదమ్మా. మీ బావ పుట్టినపుడు కబురంపింది. కాని నేను వెళ్ళలేదు. ఆ నాటికి నాలో తాపం చల్లారలేదు." అమాటలంటూనే గది విడచాడాయన.

ఆమె ఆలోచిస్తూ పడుకుంది, ఎన్నో ఆలోచనలు అలా అలా వచ్చి పోతున్నాయి. ఆరాత్రంతా ఆమెకు నిద్రపట్టలేదు. కనురెప్పల

కెప్పుడు పడక చేరిందో మాత్రం తెలియదు. కొంచెం ఆలస్యంగా లేచింది. తండ్రి వెళ్ళిపోయారని తెలుసుకుంది. తన తల్లి తలెత్తలేక పోయింది. మాలతి ఏం మాట్లాడలేదు ఏం ఆలోచించుకుందో మరి. తల్లి దగ్గరనుంచి వెనుదిరిగింది. స్నానంచేసి ఆనంద్ వద్దకు వెళదామని మాలతీ లత అల్లిబిల్లిగా అల్లుకున్న గేటుదగ్గరకువచ్చి నిలబడింది. ఏదైనా ఆటోరిక్షా వస్తుందేమోనని చూస్తున్నాయి ఆమెకళ్ళు. అంతలో సైకిలువేసుకొని రాము ఆమె ముందుకొచ్చి ఆగాడు. సైకిలుదిగి

"నమస్తే అమ్మగారూ!" అన్నాడు.

"ఏమిటిరామూ ఇటు వచ్చావు? నాన్నగారికోసమా?" మాలతి ప్రశ్నించింది.

"కాదమ్మగారూ!" ఆయన ఏవూరో వెళ్ళారని మేస్త్రీచెప్పాడు" అని ఆమెవేపు చూస్తూ నిలబడ్డాడు.

"మరెందు కొచ్చావ్?"

"ఏమిలేదమ్మగారు!" అంటూ అటూ యిటూ చూసి జేబులోని కవరుతీసి ఆమెకిస్తూ "ఆనంద్ బాబుగా రివ్వమన్నారమ్మా" అన్నాడు.

"ఉన్నారా?"

"లేరమ్మా. రాత్రేదో పనిమీద వూరెళ్ళారు."

"ఏవూరో?"

"నాకు తెలియదమ్మా."

"ఐతే ఈ కవరెప్పు డిచ్చారు?"

"వెళ్ళే టప్పు డిచ్చారు."

"కవరును చూచుకొంటూ రాము చేతిలో ఒక రూపాయి నోటుంచింది. రాము సంతోషంతో ఆమెవైపు చూస్తూ వెళ్లిపోయాడు.

మాలతి తన గదికొచ్చి కవరు చించింది. ఆమెలో ఎన్నో ఊహాలు మబ్బుల్లోకానికి పరుగిడుతున్నాయి. కాగితంతీసి చదవ నారంభించింది.

"మాలతీ !

నా ప్రవర్తన నీకు అగమ్యగోచరమవవచ్చు. నీ దృష్టిలో నే నొక అసమర్థుడుగానే కనుపడవచ్చు. నీవు ప్రేమించావని తెలిసినా నేను ప్రేమించకపోవటానికి కారణాలనేకంవున్నాయి. సమయంవచ్చిందికనుక వ్రాయక తప్పలేదు: నా హృదయంలో పెనుతుపాను ఎలా చెలరేగుతుందో నీవెలా చూడగలవు? పరిస్థితుల ప్రభావం నన్నెలా బాధిస్తుందో ఆ భగవంతునికే తెలియాలి. అందువల్లనే, నేనలా వుండవలసివచ్చింది. నీమీద నాకు ప్రేమలేకకాదు. ఆ ప్రేమ మరోరకమైన ప్రేమని నీవు తెలుసుకుంటే నాకదే చాలు. నన్నర్థం చేసుకుంటావని ఆశిస్తున్నాను. నిన్ను ప్రేమించలేదన్న నెపంమాత్రం నామీద వేయకు. అంధకారంలో విలవిలా తన్నుకొనే పక్షిలాగవుంది నాజీవితం. అటువంటిజీవితాన్ని అర్థంచేసికో పూర్తిగా చదివి.

ఆనాడు దీపావళి. ఆరోజు ఊరంతా దీపాలకాంతిలో లీనమైంది. మాయింటిని పెనుచీకటి గాఢంగా కౌగిలించుకొంది. అందరూ సంతోష సాగరంలో కేరింతలుకొడుతూ ఈదుతున్నారు. నేను నిస్సారసాగరంలో గిలగిలా తన్నుకుంటూ మునకలువేస్తున్నాను. అప్పటికి మా అమ్మ జ్వరపీడితురాలై మంచంలోవుంది. దీనంగా పిలిచిందినన్ను. వెళ్ళి మా అమ్మ చెంతనే కూర్చున్నాను. మాఅమ్మ కన్నీటితో కథయిలా చెప్పుకొచ్చింది. అంతవరకు నాకీవిషయమే తెలియదు. నేను వింటూ కూర్చున్నాను. మాఅమ్మ చెప్పటం ప్రారంభించిందిలా.

'మా అమ్మకు నేను, మా అన్నయ్యా ఇద్దరమే. మానాన్న చిన్ననాడే చనిపోయాడు. మా అమ్మ ఎంతో గారాబంగా పెంచి పెద్దవాళ్ళను జేసింది. కూస్తోకాస్తో వుండబట్టి కాలం అనుకూలంగానే సాగింది. కొంతకాలానికి మా అన్నయ్య పెండ్లిజరిగింది. నా వివాహ విషయంలో చెరోదారీ తీశారు. చివరకు అమ్మమాటే నెగ్గింది. అన్నయ్యకు తల కొట్టినట్లనిపించింది. తనమాట నెగ్గలేదని మనసులో మండిపోతూ వుండేవాడు. ఆనాటినుంచీ మాతో మాట్లాడ్డం మానివేశాడు. ఇంట్లో పరిస్థితులు భయంకర స్వరూపాన్ని దాల్చాయి. ఆ బెంగతోనే అమ్మ మంచంబట్టి ఈ లోకాన్ని విడిచింది. ఆ తరువాత నేను కాపరానికొచ్చేశాను. నీవు పుట్టావని తెలిసికూడ రాలేదు. తరువాత మామయ్యకు ఆడపిల్ల పుట్టిందని తెలిసింది. నాకు కబురంపలేదు. నేను వెళ్ళలేదు. ఆనాటినుండి ఈనాటివరకు తెగిన త్రాడు ముడిపడనేలేదు. కాని, నీ రక్తానికి సంబంధించిన వారెవ్వరూ లేరని నీవెప్పుడూ బాధపడవద్దు. ఇన్నాళ్ళనుండి చెప్పే సమయం రాలేదు. ఈనాడా సమయం వచ్చింది. చెప్పాను. నీవు ఏకాకివిమాత్రం కావు.'

అంటూ దిగజారిపోతూంది. నేను మిగిలిన విషయాలు అడుగుతూండగానే ఆమె యీ లోకాన్ని విడిచింది. ఆనాటినుండి ఈనాటివరకు మామయ్య నివాసమెక్కడో. ఆయన పేరేమిటో కూడ నేను తెలుసుకోలేకపోయాను. ఆనాటినుండి ఈనాటివరకు నావాళ్ళను నేను కలుసుకోలేదు. మేము అప్పటికి ఆవూరు వచ్చి చాలా సంవత్సరాలైంది, ఆవూరు వచ్చిన 2 సంవత్సరాలకు మానాన్న చనిపోయాడు. కర్మ ప్రభావంచేత సృష్టించబడిన కాలసర్పం మా అమ్మను కాటువేయడానికి వెనుదీయకపోయినా, పరిస్థితులు భయంకర స్వరూపాన్ని దాల్చి మా అమ్మ గుండెను రంపపు పొట్టులా మార్చివేసినా, మా అమ్మనన్ను

చూచుకొంటూ ధైర్యంతో జీవితాన్ని ముందుకు నడిపించింది. ఎన్ని కష్టాలననుభవించటానికైనా వెనుదీయని మా అమ్మకష్టాలను కన్నీటితోనే కడతేర్చుకుంటూ పెంచి పెద్దవాడ్ని చేసింది. చదువుచెప్పించింది. చివరకు నా బి. ఏ. తో ఆస్తి అయిపోయింది. ఇక మా అమ్మకూడ అన్యాయంచేసి వెళ్ళిపోయింది. అప్పటికివున్న యిల్లు తాకట్టులో వుండటంవల్ల అమ్మి అప్పులు తీర్చి చేతికొచ్చిన వందరూపాయంతో నిర్జీవుడనై పట్నం చేరాను గతిలేక, ఆ ప్రాంతాల్లో వుద్యోగం దొరకక. ఆ తరువాతి విషయం అంతా నీకూ తెలుసు, కాని ఈ వుత్తరం చూసే వరకు నే వెళ్లిపోతున్నానన్న విషయం నీకు తెలియదు, నేను అనివార్య కారణాలవల్ల పట్నం వీడవలసి వచ్చింది. చివరిసారిగా నీ కిలారాయాలనిపించింది. రాశాను.

నా జీవితం అలానడిచింది. ఇన్ని విషమ పరిస్థితులు నన్ను ముట్టడించడం వల్లనే నా మనశ్శాంతి కోల్పోయి నీతో అలా ప్రవర్తించాను. నీ మనస్సు గాయపరచినందుకు క్షమించు మాలతీ! ఇకనే వుంటాను.

ఇట్లు,
నిర్భాగ్యుడు,
ఆనంద్."

పూర్తిగా చదివింది. కన్నీరేరులై పొంగి ప్రవహిస్తోంది. హృదయంలో పెనుతుపానువల్ల చెలరేగే గాలులు వేగాన్ని చేకొన్నాయి. కనులముందు ప్రపంచమంతా నల్లతెరను కప్పుకున్నట్లుగా కనిపిస్తోంది. ఆమె మనసులో అగ్నిపర్వతాలు బద్దలయి లావా ప్రవహిస్తోంది. మస్తిష్కం మరిగిపోతోంది. ఆమె పేగులు పెనవేసుకుపోతున్నాయి.

ఆమె గుండె అడుక త్తెరలోపడి నలిగిపోతోంది. ఆమె ఎంత ఆవేదనకు గురి అయినా ఏం ప్రయోజనం ?

మంచముమీదనుండి లేచి సరాసరి తల్లిదగ్గర కెళ్ళింది. ఆవేదనలో ఆమె కనులవెంట నీరు కారుతూనేవుంది. నీరుకారే కండ్లతోనే "అమ్మా !" అనికేకవేసిందిపేగులుతెగేటట్టు. కూతురు కేకవిని ఆదుర్దాగావచ్చింది సావిత్రమ్మ. విషయమంతా తెలుసుకుంది. విషాద సాగరంలో మునిగి తేలుతోంది. ఆమె చేతిలోనిలేఖ అల్లల్లాడుతోంది. ఆమె హృదయసాగరంనుండి తుపానుగాలులు చెలరేగాయి. తన కూతురు భావి జీవితాన్నిగురించి ఆమెకేవో పిచ్చి వూహాలు చెలరేగాయి. అశ్రుపూరిత నయనాలతో ఆవేదనా వదనంతో కన్నకూతురు కనులముందు నిల్చింది. ఆమె గుండె రగిలిపోతూంది. ఆ క్షణాన తన ఆశాదీపికకు ఏం సాయమొనరింప గలదు ?

సాయంత్రమయింది. తనగదిలో పడుకొని కిటికీలోనుండి మాలతీలతవైపుకు చూస్తూంది మాలతి తండ్రిరాకకోసం. హాలులో గడియారం టింగ్ టింగ్ మని ఆరుసార్లు నీరసంగా మూలిగింది. ఆమె అలా చూస్తూ పడుకునేవుంది. ఆవరణలోకొచ్చి ఆగినకారు ఆమెదృష్టిని తనవైపుకు ఆకర్షించింది. చరాచరాదిగి క్రిందకువచ్చింది. ఆమె వచ్చేటప్పటికి నిస్సారంగా లోనికివచ్చాడు రాఘవరావుగారు. తండ్రివదనాన్ని పరిశీలించి చూచింది. ఆయనవదనం కారుమేఘాలు ఆవరించిన ఆకాశంలా వుంది. ఆమె గుండెలను ఎవరో నొక్కినట్లనిపించింది. ఆయన ఆమెతో ఏంమాట్లాడలేదు.

"నాన్నా !" అంటూ తండ్రి గుండెలను హత్తుకుంది.

ఆమెను ఎలా సముదాయించాలో అర్థంకాలేదాయనకు. అంతలో "ఆనంద్ బావ రాత్రి వెళ్ళిపోయాడునాన్నా" అంది ఆమె.

"ఏమిటమ్మా నీవు మాట్లాడేది?"

"ఔను నాన్నా. బావ రాత్రి వెళ్ళిపోయాడు."

ఆమె మాటల్లో మర్మం ఆయనకు అర్థంకాలేదు. ఆయన తల గిర్రున తిరుగుతోంది. ఆలోచిస్తూ "ఇంకా నా కర్థం కాలేదమ్మా. చెప్పే దేదో సరిగాచెప్పు."

"ఔనునాన్నా!" అంటూవెళ్ళిఉత్తరంతెచ్చితండ్రిచేతికిచ్చిందిఆమె.

ఆయన తన చేతిలోకి తీసికొని కంగారుగా ఉత్తరం మడతలు విప్పి చదువ నారంభించాడు. ఆయన వదనానరంగులు మారసాగాయి. అప్రయత్నంగా ఆయన కళ్ళనుండి అశ్రువర్షం కురవ నారంభించింది. పూర్తిగా చదివి నిర్జీవుడై మారు మాట్లాడకుండా శూన్యంలోకి చూస్తూ కూర్చున్నాడు. అలా శూన్యంలోకి చూసే రాఘవ రావుగారు కారువైపు నడిచారు. వెళ్ళే తండ్రిని చూస్తూ దీనంగా పిలి చింది అశ్రువులను తుడుచుకుంటూ మాలతి.

"వస్తానమ్మా. ఇప్పుడే వస్తాను" అంటూ కారెక్కాడు.

ఆ మాటలు చాలా దాధగా వచ్చాయి. మరుక్షణం గాలిని చూసు కుంటూ సాగింది చిన్నకారు. సరాసరి ఫ్యాక్టరీకి వచ్చింది. వెనువెంటనే రామూని పిలిచి ఏవో విషయాలు అడిగాడు. రాము యిచ్చిన సమాధా నాలు ఆయనకంత సంతృప్తిని కలుగజేయలేక పోయినాయి. లాభం శూన్యమైంది. మనస్సు వికలమైంది. వెంటనే వెను దిరిగారు. ఆయన తలలో ఆలోచనలు సుడిగాలిలా చెలరేగుచున్నాయి. సరాసరి పత్రికా ఫీసుకు వెళ్ళి ఏదో ప్రకటన ఇచ్చి యింటి కొచ్చారు. ఆయిన యింట్లో అడుగుపెట్టగానే -

"ఎక్కడికి వెళ్ళారు నాన్నా?" అంది మాలతి.

"ఫ్యాక్టరీకి వెళ్ళాను. లాభం శూన్యమయింది. పత్రికాఫీసు కెళ్ళి ప్రకటనయిచ్చి వస్తున్నాను."

"ఏమనిచ్చారండీ?" అందుకుంది సావిత్రమ్మ.

"నాయనా ఆనంద్ !

నీ వెళ్ళిన మరునాడే నాకు చాల ప్రమాదం సంభవించింది. జ్వరపీడితుడనై తుది దశలో నున్నాను. జ్వరం 104 డిగ్రీలదాకా వస్తోంది. నామీద నాకు అపనమ్మకం పుట్టింది, కడసారిగా నిన్ను చూడాలనివుంది. ఎక్కడున్నా వెంటనే రావలసిందిగా కోరుతున్నాను. నీ కోసం ఎదురుచూస్తూ వుంటాను.

ఇట్లు
నీ శ్రేయోభిలాషి.
రా ఘ వ రా వు."

"అని యిచ్చాను."

"మీ తెలివంతా ఎక్కడ దాచారండీ? నీవు నా మేనల్లుడివే. ఇలా యిలా జరిగింది. అయి పోయిందేదో అయి పోయింది. నీవు వెంటనే రావలసింది. అని యిస్తే ఎంత బాగుండేది? సంతోషంతో రెక్కలు కట్టుకు వ్రాలేవాడు గదండీ!"

"ఇక నీవూరుకో. నీవు చెప్పిన ప్రకారం అయితే ఆనంద్ వ్రాసిన కవరులోనేవుంది. అలా ప్రకటిస్తే యిదేదో ఎత్తులావుంది అను కుంటాడు. అప్పు డసలు ప్రమాదంగదా!"

"ఎత్తు అని ఎందుకు అనుకుంటాడండి?"

"చెప్పేది జాగర్తగా విని అర్థంచేసికో. అమ్మా యతన్ని ప్రేమించింది గదా!"

"ప్రేమిస్తే?"

"అదికాదే. ప్రేమించింది గనకేరాడు."

"ఎందుకనంటారు ?"

"వాడి మేనమామనని వాడికి తెలియదు. ఇప్పుడలా ప్రకటిస్తే నమ్మడు. అమ్మాయి ప్రేమించింది. అతను తిరస్కరించాడు. ఆ తరువాత అమ్మాయి ఏదో అఘాయిత్యం తలపెడితే దాని బాధచూడలేక నేనేదోయుక్తి పన్నానని తప్పక అనుమానిస్తాడు. అదీ కాక తనవుత్తరం చూసిన తరువాతే మనకావూహ తట్టిందని అనుకుంటాడు. అటువంటప్పుడు ఎలావస్తాడు ?"

"యిలాఅయితేమాత్రం వస్తాడని నమ్మకమేముంది ?"

"నేనంటేవాడికి చచ్చేప్రేమ. నేనాపరిస్థితులలోవున్నానని తెలిస్తే రెక్కలు కట్టుకువస్తాడని నాకు నమ్మకముంది."

"అసలెందుకండీ? అతను రాత్రేగావెళ్ళింది. అతను చేరవలసిన చోటు చేరగానే వుత్తరం వ్రాయండి. అతని స్వగ్రామం మీకు తెలుసు గదా?"

"అనవసరంగా విసిగించకుసావిత్రీ? నీకసలు తలతిరిగింది. రామాయణమంతావిని రాముడికి సీత ఏమౌతుందన్నట్లున్నది నీప్రశ్న."

"ఏమిటండీ మీరు మరీనూ. ఆ చెప్పేదేదో సరిగా చెప్పగూడదూ ?"

"అమ్మాయి ప్రేమిస్తోందని అతనికి తెలుసుగదా! అతను అనేక కారణాలవల్ల అంటే వాళ్ళమ్మ ఆఖరిసారిగా చెప్పినమాటలకనుగుణంగా అతను మాలతిని ప్రేమించలేకపోతున్నాడని తెలిసిందా ఇప్పటికైనా ?"

"బోధపడిందిలెండి. అయితేయిక కర్తవ్యమేమిటో ?" అంటూ భర్త సమాధానంకోసం నిరీక్షిస్తూంది సావిత్రమ్మగారు.

"అసలీ తతంగమంతా నేనేచేశాను. లేకపోతే ఆనంద్ యిక్కడే ఉండేవాడు. అతను నావల్లనే పట్నంవిడిచి వెళ్లిపోయాడు."

"ఏమిటండీ మీరనేది!"

"ఏముంది. నా చేతులార నేనే నా కొంపని కూల్చుకున్నాను. నాకోపం ఎంతపని జేసింది? వాడి తండ్రి తల్లి చనిపోయినా వాడు నాదగ్గరకువచ్చినా గుర్తు పట్టలేకపోయాను. అసలెంతో మంచివాడని నాకు తెలుసుకదా? నీ కథేమిటబ్బాయి? నీపూరేమిటబ్బాయి? అని పూర్తిగా ఏనాడైనా అడిగివుంటే ఎంత బాగుండేది!"

"సర్లెండి. అయినదానికి ఆలోచన ఎందుకు?"

"అసలు నేనే ఆనంద్ ని రాత్రి వెళ్లిపొమ్మన్నాను" అంటూ జరిగిందంతా చెప్పుకొచ్చాడు. తల్లీకూతుళ్లు ఒకరి ముఖాలు ఒకరు చూచుకున్నారు.

"అందుకేనండి. అంతా విధివిలాసం అంటారు! అంతాగమ్మత్తుగా జరిగిపోయింది."

"ప్రకటనచూస్తే తప్పకుండా వస్తాడనే ఆశ ఏడిపిస్తోందినాలో."

"పాపం రాజ్యం వదిన ఈలోకాన్ని విడిచింది. ఏనాడు అన్నగారిల్లని రాలేదు. అసలు చుట్టరికమే రూపుమాసింది. ఆమె మనసును మీరర్థం చేసికోలేకపోయారు. ఆమె చివరి క్షణాల్లోకూడ తనకొడుకుతో మీ గురించి చెప్పింది. మీ బావగారుగూడ చనిపోయారు. మీ పగే చుట్టరికాన్ని సర్వనాశనం చేసింది, అవడానికా అంత పెద్దవాళ్ళు. చిన్నచిన్న విషయాల్లో కొంపలుతీసికొంటారు. ఇదంతా మీరే చేశారు." అని ఆవేశంతో అనేసింది. వదిన చచ్చిపోయిందన్న బాధతో యిష్టమొచ్చినట్లు ఘాటలు అనేసింది. ఆమె కన్నులు చెమ్మగిలాయి.

"అన్నీ తెలిసే మళ్ళీ అనాలా సావిత్రి! తప్పంతా నాదేనని అనుకునేకదా? ఈనాటికివాడికోసం వెళ్ళి తిరిగొచ్చాను. ఈ విషమ పరిస్థితులకు సూత్రధారిని నేనేనని ఒప్పుకున్నానుగదా! నాకు మాత్రం సోదరీ ప్రేమలేదంటావా? కాని నా ఆత్మాభిమానం నన్నలా భంగ పరిచింది."

ఇక ఏం మాట్లాడ లేక లేచి వెళ్ళిపోయింది మాలతి.

"క్షమించండి! వదిన చనిపోయిందన్న బాధతోను, ఆనంద్ వెళ్ళిపోయాడన్న ఆవేశంతోను అలా అన్నాను" అంటూ జాలిగా చూచి తిరిగి అంది.

"పాపం చనిపోయే ముందు అంతా గుర్తుకు తెచ్చుకొని ఎలా కుళ్ళిపోయిందో! పాపం ఆనంద్‌ని దిక్కులేనివాడిగా చేసిపోయింది. ఆనంద్ ఆవేదన ఎలా వుంటుందో వూహించండి. అతను మనసొంతని తెలిసిన క్షణంనుండి మనస్సు అతని వైపునకు పోతోంది పదే పదే."

"మనరోజులు బాగుంటే తప్పక ఆనంద్ వస్తాడు, వాళ్ళ చిలకా, గోరింకల్లా కలిసిమెలిసి తిరుగుతుంటే మనం ఆనందించే రోజులున్నా యని ఆశజనిస్తోంది. ఏం బాధపడకు. దైవనిర్ణయం ఎలావుంటే అలా సాగుతుంది. మనమేం చేయలేం కదా?"

"అంతేనండి. భగవంతుడి దయ! మీరు స్నానంచేసి భోజనానికి రండి!" అంటూ వెళ్ళింది సావిత్రమ్మ.

రాఘవరావుగారులేచి కూతురు గదికివచ్చి కూతురువైపుచూస్తూ నిల్చుండిపోయాడు. ఆయన మనస్సు మరొక్కసారి బాధతోమూల్గింది. కన్నకూతురు పరిస్థితి కనులారా చూస్తున్నాడు. ఆ సమయంలో మాలతి తన పుట్టినరోజు పండుగనాడు ఆనంద్ బహూకరించిన కష్ట జీవులు

అనే వెండిబొమ్మని చూస్తూ కన్నీరుకారుస్తోంది. ఆమె ఆశాస్వరూపమే ఆ కష్టజీవుల బొమ్మ. ఆక్షణాన ఆమె తన తండ్రి రాకను చూడలేదు.

రాఘవరావుగారు మెల్లిగా పిలిచాడు. ఆమె ఆయన్ని సమీపించింది. పులిలాంటి తన తండ్రి ఈ సమయాన పిల్లిలాకనపడటం ఆమె మనసు కెంతో బాధను కల్గించింది,

"నా మీద కోపంగావుందా మాలతీ ?"

"కోపమెందుకునాన్నా ?"

"మీ అత్తనీ, మీ మామనీ నీవు ఏనాడు చూడలేదు. నా కోపం ఎంతపని చేసిందో చూడు, అందరికీ అన్యాయంచేసిందమ్మా! నన్ను దేవుడుకూడ క్షమించడు" అంటూ కన్నీరొత్తుకున్నాడు.

"మీరుకూడ కన్నీరు కారుస్తున్నారానాన్నా! మీరు చేసిందేముందీ, అంతా దైవనిర్ణయం. కర్మదృష్టిలో లక్షాధికారియైన భిక్షాధికారయినా ఒకటేగానాన్నా!"

"అవునమ్మా నామూలానే ఆమె అలా దిగజారిపోయింది. ఆమె కెంతో అన్యాయంజేశాను. నాపగ (తాచుపాము) యి నన్నేకాటేసిందమ్మా. అందుకనేఅన్నారు ఎవరు తీసినగోతిలో వాళ్ళే పడతారని. ఆపనికాస్త నాకేజరిగింది."

"ఎన్నసుకున్నా అత్తయ్య తిరిగిరాదుగానాన్నా. బావకూడా వెళ్లిపోయాడు."

ఆయన నిర్జీవుడై నిష్క్రమించాడు. వెళ్లిపోయేతండ్రిని చూస్తూ ఆమె యిలా అనుకుంది,

"ఆనంద్ మాబావ. తిరిగి కలుసుకుంటామా ? ఆ శుభసమయం వస్తుందా ?" అని అనుకుంటూ ఏదోఆశగా కిటికీలోంచి మాలతీలతవైపు చూస్తూ పడుకుంది.



దసరా సెలవులు ఆరంభమయ్యాయి. సెలవులంటే అందరికీ ఆనందమేకదా! ఔను మరి ఆనందమెందు కుండదు? ప్రతిరోజూ కాలేజీకి ఇంటికి తిరగటం తప్పుతుందాయె మరి. తిరగకపోతే ఎలాగన వచ్చు? ఏ ఆశయంతో కాలేజి గుమ్మం తొక్కుతాడో ఆ ఆశయం నెరవేరేదెలానవచ్చు? కానీ, ఎటువంటివారికైనాసరే, కాలేజి అంటే ప్రాణసమానంగా చూసుకునేవారికైనాసరే, సెలవులువస్తే బాగుండు ననిపిస్తుంది. ఏదో నాలుగురోజులు ప్రశాంతంగా వుండవచ్చునని.

సెలవులైనా ప్రశాంతంగా కాలం గడపలేకపోతోంది మాలతి. మరీ బాధగావుందని చెప్పకతప్పదేమోబాధ: ఇరువది నాలుగు గంటలూ ఇంటివద్దనే కాలం గడపాలంటే కష్టంగానే వుందామెకు. ఒకే సమయం ఒకరికి ఆనందాన్ని చేకూర్చవచ్చు. అదే సమయం ఇతరులకు విచారాన్ని కల్గించవచ్చు. కాదనలేము. ఆమె హృదయంలో ఆనంద్ వస్తాడన్న ఆశనశించింది పూర్తిగా. పత్రికలో ప్రకటించి నా ప్రయత్నం ఫలించలేదు. అటువంటప్పుడామె నిరాశకు అడ్డేముంది? ఏమైనా మాలతి హృదయం మరిగిపోతూనేవుంది.

అలా ఆలోచనకు గురిఅయి మాలతి కూర్చొనివుంది. అంతలో ఆమె ముఖ్యస్నేహితురాలైన కమలవచ్చి, కూర్చొంది. ఇద్దరూ మాట్లాడు కుంటున్నారు.

"ఏమే మాలతీ! మీ దావజాడ తెలిసేటట్టులేదేమే! ప్రకటన చూస్తే రాకుండావుండగలడంటావా? పాపము ఎక్కడున్నాడో? ఎలా వున్నాడో? నీ అదృష్టం కలిసిరాలేదే! ఇదంతా ఏమిటోగావుంది."

"నా ఖర్మ కమలా. దేవుడు సహకరించందే నేనేంచేయగలను?"

"దేవుడు చల్లగా చూస్తే అన్ని కష్టాలు తీరతాయి. నీవు మాత్రం ధైర్యంగావుండు. కష్టంవచ్చినప్పుడు హృదయాన్ని అదుపులో పెట్టుకోటంలోనే మన తెలివితేటలు వుపయోగపడాలి. నీవు మాత్రం చీటికి మాటికి కన్నీరు కార్చటం బాగుండదు. దైవనిర్ణయం ఎలావుంటే అలా జరుగుతుంది."

"సరే, మీ వూరికి ప్రయాణ మెప్పుడు?"

"బాగా అడిగావే మాలతీ. నీవు వస్తానని యిప్పటికి ఎన్ని వాయిదాలు వేశావో ఆలోచించుకో కొంచెం. ఈ సారి మాత్రం తప్పకుండా రావాలి."

"ఇప్పుడెందుకులేవే!"

"నో, నో. అలాఅంటే నే ఒప్పుకోను. మనస్నేహం ఆరంభమైనప్పటినుండి వస్తానంటున్నావు. అంటున్నావేకాని ఆచరణలో పెట్టుకో లేకపోతున్నావు. ఇప్పటికే నీవువస్తానని చెప్పి రెండుసంవత్సరాలు దాటి మూడవసంవత్సరం కూడ వచ్చింది. ఎప్పటికప్పుడు తప్పించుకోవటమేనా?"

"సమ్మర్‌లో తప్పకవస్తానే."

"నో, నో, ఇప్పుడేరావాలి."

"ఇంత మొండిఘటానివేమే నువ్వు?"

"నీకు రావటాని కిష్టం లేకపోతే ఒకేసారి చెప్పెయ్యరాదూ?"

"ఏమిటేవ్. అంతయిదిగా మాట్లాడుతున్నావ్?"

"నీయిష్టప్రకారమేకానీ!"

"అలాఅన్నావు బాగుంది. రేపే ప్రయాణం."

"సరే నీయిష్టం."

"ఆల్ రైట్. సంతోషంతో అందికమల."

"నీవురాత్రికిక్కడికే వచ్చేయి. రేపటినుండే వెళ్లిపోదాం." అంది మాలతి.

"అత్తయ్యను కల్సుకుని వెళ్ళలేను." అంటూ లేచింది కమల. కమలననుసరించింది మాలతి. ముగ్గురూ కాసేపు మాట్లాడు కున్నారు. రాత్రయింది. స్నేహితురాళ్ళిద్దరూ పడుకున్నారు ఎవరి స్వప్నపు ఊహలు వారు ఆలోచించుకుంటూ.

తెల్లవారింది. టైము 7 గంటలయింది. ఇద్దరూ స్టేషను కొచ్చి టిక్కెట్లు తీసికొని ఫస్టుక్లాసులో కూర్చున్నారు, రైలు కదిలింది. గాలిని చీల్చుకుంటూ రైలువేగం హెచ్చింది.

అప్పుడే కమల, మాలతీ వచ్చి రెండురోజు లయిపోయింది. కాలం అనుకూలంగానే సాగిపోతూంది. ఆ రోజు నాటకానికి బయలు దేరారు. వాళ్ళకేం ధనవంతుల బిడ్డలు. ఆ టౌనులో వున్న మూడు సినిమాహాల్సులోను పెద్దహాలు కమలగారిదే. ఆ హాలులోనే నాటకం. ఈ రోజు ఇంటికి రిజర్వుడు టిక్కెట్లు వచ్చినాయి. అవి పట్టుకొని కారువేసికొని హాలుకు చేరారు. తమసీట్లలో వారు కూర్చున్నారు. నాటకం ఆరంభమయింది. తెర లాగారు.

మంచంలో అతని తల్లి చావుకు సిద్ధమైవుంది. అతను ఆమె చెంతన కూర్చుని వున్నాడు. అతనికి పూర్తిగా గడ్డంమాసివుంది.

"నాయనా ! మూర్తీ!"

"ఏమిటమ్మా ?"

"నాజబ్బుతోపాటు నీ గడ్డంకూడ పెంచుకున్నావా !"

"ఊరుకో అమ్మా"

అలా మాట్లాడుతుండగానే అనంత జగత్తులో సమాధి అయి పోయిందామె ఆఖరిమాటలు చెప్తూ.

"నన్ను విడిచిపోయావా అమ్మా! ఈ లోకంలో నేను ఏకాకినా? దిక్కులేని పక్షిగా చేసి పోయావా అమ్మా! కష్టించి కడుపు కట్టుకుని నా సుఖంకోసం నన్ను చదివించావు. సిఫారసులతో ఆవృతమైన ఈ లోకంలో నాకు వుద్యోగమే దొరకలేదు. నీ ఆశ ఫలించకుండానే వెళ్ళిపోయావా! అమ్మా! ఈ లోకంలో నీ సాటి ఎవరమ్మా నాకు? నా రక్తానికి సంబంధించినవాళ్ళు ఎవరమ్మా? నన్నుచూచి బాధ పడేవారు సంతోషించేవారు ఎవరమ్మా? ఈ లోకంలో ఏకాకినై పోయాను." అంటూ ఏడుస్తున్నాడు మూర్తి.

మాలతి నయనాలు అశ్రుపూరితా లయ్యాయి. ఆమె కళ్ళల్లో ఆనంద్ మెదులుతున్నాడు. ఆ నాటకంలోని సన్నివేశాలు చూస్తూ వుంటే తన బావ ఎంతబాధ పడ్డాడో తన కండ్లకు కట్టినట్టు కనపడుతూంది. కడుపులో కోత పుడ్తూంది. కర్చీఫ్‌లో దాచుకుందికన్నీరు కమలకు కనిపించకుండా.

నాటకం పూర్తి అవుతుంది. యింకొక రంగంతో తెరలాగ బడింది. ఈ లోకంలో ఏకాకి ఐన ఆ జీవి మంచానికి అంటుకుపోయి యున్నాడు. అతని స్నేహితుడు వచ్చి చెంతను కూర్చొని మందు త్రాగమని బ్రతిమలాడుతున్నాడు. ఆజీవి పిచ్చిగా నవ్వి-

"మనో వ్యాధికి మందు కనిపెట్టిన మానవుడీ లోకంలో ఎవ్వడురా భాయి! పరిసర ప్రభావాలు నన్నిలా చేశాయి. చల్లని తల్లి కరుణా కటాక్షవీక్షణాలు నామీద ప్రసరింపచేస్తూ ప్రేమతో తన చేతులు చాచి కౌగలించుకోపటం కోసం నవ్వుతూ నన్నాహ్వానిస్తోందిరా?" అన్నాడు మూర్తి.

"ఎవర్రా ?" అంటూ ప్రశ్నించాడతను.

"ఓరిపిచ్చివాడా! ఇంకెవరురా! అందరికీతల్లి. పేదలకైనా ధనికులకైనా ఆహ్వాన మొకేరీతిగా పంపేతల్లిరా! కుంటివైనా కురూపి వైనా ప్రేమతో తన వాళ్ళోదాచుకునే తల్లిరా! చల్లనితల్లి మృత్యు దేవతరా! తెలుసుకున్నావా!" అంటూలేచినిలబడ్డాడు పిచ్చిగానవ్వుతూ. అతన్నిపట్టుకొన్నాడతని స్నేహితుడు. అతనలా మాట్లాడవద్దని మరీ మరీ బ్రతిమాలాడు. సోలే స్నేహితుని గట్టిగా పట్టుకున్నాడు.

"ఈ పాడులోకంలో నేనుండలేనురా! ధనార్జనతో తనహస్తాలను యినుప హస్తాలుగా మార్చుకొని అయినుపచేతుల్తో పేదల గుండెలను నొక్కే ఈపాపిష్టి లోకంలో నేఉండలేనురా! నేనుకూడ మా అమ్మదగ్గరకే పోతున్నాను" అంటూ జారిపోయే సమయాన అతనినోటినుండి రక్తం పెల్లుబికింది. తెరపడింది.

మాలతి గుండె తరుక్కుపోతోంది. ఆమెనయనాలకొకసారి రెప్ప లడ్డంపడినాయి. ఆమెహృదయంలో సంక్షోభం చెలరేగుతోంది. నాటకం చూచింది. ఆమె నవనాడులు కదిలిపోతున్నాయి. తనబావజీవితానికి ఈ నాటకానికి సంబంధం చాలదగ్గరగావుంది. తనబావ ఏమయ్యాడో అను కున్న మరుక్షణం ఆమె గుండెనెవరో పిడికిలిలోపెట్టి నొక్కినట్లనిపిం చింది. తనబావను గురించి ఎన్నో పిచ్చిఆలోచనలు లేచాయి ఆ మస్తిష్కంనుండి. నిస్సారంగా మూలిగింది ఆమెమనస్సు.

అంతలో ఆ జిల్లాకలెక్టరుగారు మూర్తిపాత్రధారియైన ఆనంద్‌ని అభినందిస్తూ యిలాఅన్నారు- "ఈ సంతోషసమయంలో నిస్సహాయ స్థితిలోనున్న నేను నా రిస్టువాచిని బహూకరిస్తున్నాను." అంటూ ఆనంద్ చేతికందిచ్చారు గడియారాన్ని.

"ఇటు వంటి కళాకారులు నిత్యం భారతభూమిలో జన్మించాలని. శ్రీఆనంద్ గారు ఆరోగ్యఐశ్వర్యాలతో వర్ధిల్లుతూ తన కళాసామర్థ్యాన్ని పెంపొందించుకోవాలని, ఆశక్తి ఆయనకు సమకూర్చుమని మన అందరి తరపున దైవాన్ని ప్రార్థిస్తున్నాను." అని విరమించారు. ఆ మరుక్షణం కరతాళధ్వనులు మిన్ను ముట్టాయి.

ప్రజల కతనంటే ఎంతో అభిమానం పెంపొందింది. అతని నటన చూచే సమయంలో వారి గుండెలు కన్నీటిలో ఆర్ద్రిలయ్యాయి. వారి కన్నీరు జారిపోయాయి. వారి నోటి ధ్వని తెన్నో గాలిలో కలిసి పోయాయి.

హాలులో కమల, మాలతి మిగిలారు,

"కమలా అతనెవరో తెలిసికోవాలి." అంది భారంగా.

ఆమె తన తండ్రిని సంప్రదించింది మరుక్షణం.

"నమస్తే" అంటూ వచ్చి ప్రక్కకు చూచి నిర్జీవు డయ్యాడు ఆనంద్."

మాలతి అతని వైపు చూస్తూ "నమస్తే మిష్టర్" అంది.

"నమస్తే" అతని కనులెందుకో అప్రయత్నంగా చెమ్మగిల్లాయి.

"మీరు ఒకసారి మాతో రావాలి మిష్టర్." అంది మాలతి.

"ఇప్పుడే వస్తాను." అంటూ లోనికి వెళ్ళాడు.

"కమలా ! మీ రేవిషయం ఆయనతో చెప్పవద్దు."అందిమాలతి.

ఇంతలో ఆనంద్ వచ్చాడు.

కారు మేడ ముందు ఆగింది. అందరూ మేడలో అడుగు పెట్టారు. అప్పటికే కమల భర్తవచ్చి ఉన్నాడు. ఆ రాత్రి గడిచిపోయింది ఆనందంగానే.

తెల్లవారింది. అందరూ రైల్వేస్టేషనుకు వచ్చారు. ఆనంద్ మాలతులు ఫస్టుక్లాసు కంపార్ట్‌మెంట్‌లో ఎక్కారు. రైలు కదిలింది. కమలా దంపతులు చూస్తూ నిల్చుండిపోయారు.

సూర్య భగవానుడు తన కర్తవ్యాన్ని తాను నిర్వహిస్తున్నాడు. రైలు స్టేషనులో ఆగింది. యిద్దరూ మేడకు వచ్చారు. వారు వచ్చే సమయానికి రాఘవరావుగారు మేడలో లేరు. ఫ్యాక్టరీకి కబురువెళ్ళింది వారికోసం. మాలతి లోపలికెళ్ళి తన గదికేసి నడవసాగింది అతన్ని రమ్మని సంజ్ఞచేస్తూ కళ్ళతో. ఆమె ననుసరించాడతను. ఇద్దరూ కూర్చున్నారు,

"ఆ రాత్రి చెప్పకుండానే వెళ్ళిపోయారేం ?"

"అతను గుటకలు మ్రింగుతున్నాడు."

"మంచినీళ్ళుకావాలా మిష్టర్ !" ఆ మాటల వెనుక హాస్యం తొంగి చూస్తోంది.

"యిప్పించండి"

కూజాతెచ్చి యిచ్చిందది. అన్నీ త్రాగి కూజా క్రింద పెట్టాడు.

"ఇంకా కావాలాండీ"

"అక్కర్లేదండీ"

"అయితే, జవాబు చెప్పండి."

"అంతా మీకానాడే వ్రాశాను."

"మీ మేనమామ కనబడ్డారా ?"

"లేదండి. ఆ భాగ్యం నాకు కలుగలేదు."

"కనుపడితే ఏం చేస్తారు ?"

"ఏం జరుగుతుందో ఎలా చెప్పగలం"

"మీ వాళ్ళు కనుపడితే ఏం చేస్తారు?"

"భవిష్యత్తు నే చెప్పలేను."

"అయితే, ఆమెను ప్రేమించగలరా?"

"ప్రేమిస్తాను."

"ఎలాంటిదైనా ప్రేమించగలరా?"

"తల్లిమాటకోసం ఎలాంటిదైనా సంసిద్ధమే"

"ఆమె నిరాకరిస్తే?"

"ఏం చేయలేను."

"అప్పుడేమంటారు?"

"ఈలోకంలో ఏకాకినంటాను."

"ఆమె ప్రేమిస్తే?"

"పెండ్లాడతాను."

"ఎన్నాళ్ళీ రక్తసంబంధాన్వేషణ?"

"సాగినంతకాలం"

"వాళ్ళు కనపడకపోతే?"

"యథాప్రకారమే."

"జీవితం నాశనం కాదా?"

"అయినా దానికంటే దారుణం అవుతుందంటారా?"

"ఆమె వివాహం చేసుకున్నాక కనుపడితే ఏం చేస్తారు?"

"ఆమె సుఖాన్నాశిస్తాను."

"మీకు లాభం?"

"సంతోషం."

"అయితే నా విషయం?"

"యిదివరకే చెప్పాను."

"ఒక వేళ ఆ అమ్మాయికి వివాహం కాని పక్షంలో ఆమె యెవరినన్నా ప్రేమిస్తూ వుంటే?"

"ఆమె ప్రేమించినతన్ని నేనూ ప్రేమిస్తాను సోదరునిగా."

"కత్తిదుయ్యరా?"

"కసాయినంటారా?"

"మీ రక్తానికి సంబంధించినవాళ్లు కనపడతారని మీకు ఆశవుందా?"

"ఆశానిరాశలలో తన్నుకునేదే మానవ జీవిత మని మీకూ తెలుసు ననుకుంటాను."

"తెలుసు. అంతా తెలుసు."

ట్రే పెట్టి వెళ్ళిపోయాడు చంద్రయ్య. ఇద్దరూ కాఫీ త్రాగు తున్నారు.

"ఇప్పుడు మీరేమి చేస్తున్నారు?"

"ఉద్యోగం."

"జీతమెంత?"

"నూట పదిరూపాయలు."

"మీకు కొన్ని లక్షలు జీతమిస్తాము. వుద్యోగం చేస్తారా?"

"అక్కర్లేదు."

"ఎందుకని?"

"మీ హృదయ రాజ్యాన్నేల మంటాడు."

మాటలు సాగుతున్నాయి అలాగే. అంతలో రాఘవరావుగారు వచ్చారు. వస్తూనే,

"ఒరే ఆనంద్ !" అన్నా రప్రయత్నంగా ఆనందాన్ని పట్టలేక.

ఖిన్నుడయ్యా డానంద్. ఒక్కటిగా చేరబోయే చేతులు వెనక్కి వచ్చేశాయి.

"వచ్చావా ఆనంద్ ?" అంటూ అతన్ని కౌగలించుకున్నాడు.

అతనికేం అర్థం కాలేదు.

"నాకు ప్రాణభిక్ష పెట్టినవాడే నా మేనల్లుడని నేను తెలుసుకోలేక పోయాను !" అంటూ ఏమిటో చెప్పుకు పోతున్నాడాయన. ఆయనవైపు తదేక దృష్టితో చూస్తూ.

"మీరు చేప్పేదినాకేమి అర్థంకాలేదు."

"మీ అమ్మ ఆఖరుసారి చెప్పిన దరిద్రుణ్ణి నేనే ఆనంద్ ! మానవత్వం కోల్పోయిన ఆమనిషివినేనే."

ఆనంద్ తల తిరుగనారంభించింది.

"ఇంకా అనుమానంగావుందా ఆనంద్ ?"

ఆనంద్ మారుమాట్లాడకుండా ఆయనను వీక్షిస్తున్నాడు. అతని కనులలో నీరు నిండింది.

" మీ నాన్నపేరు గోవిందరావు గదూ ?"

"అవును."

"మీ అమ్మపేరు రాజ్యం. అవునా ?

"అవును"

"ఆమె ఎడమభుజంమీద పెద్ద పుట్టుమచ్చవుంది. అవునా ?"

అప్రయత్నంగా రాఘవరావుగారి వక్షస్థలాన్ని హత్తుకుపోయాడు ఆనంద్. అతని నోటినుండి అప్రయత్నంగా ప్రొప్రయిటరుగారూ ! అనివచ్చింది.

"ఆ మాట అనకురా ఆనంద్ ! ఈ నాటినుండి నీవే మా అందరకు ప్రొప్రయిటరువి. ఆ పగే యింతపని చేసింది. నన్ను దేవుడు కూడ క్షమించడు."

"మామయ్యా !" ..........

"ఆనంద్ !"..........

మెల్లగా పిల్లిలా సావిత్రమ్మ దగ్గరికెళ్ళి "నమస్తే అత్తగారూ !" అన్నాడానంద్.

"నాకెందుకయ్యా ఆ గార్లు. నే పరాయి దాన్ననా ?"

అంటూ నవ్వింది. అతను నవ్వుకుంటూ మాలతికేసి చూశాడు.

వెను వెంటనే రాఘవరావుగారు సావిత్రమ్మ ఒకరి మొగాలు ఒకరు చూచుకుంటూ గది విడిచారు.

"ఎంత నాటకం ఆడావ్ మాలతీ ?" మాలతిని సమీపిస్తూ అన్నాడు.

"మీరేనా తక్కువతింది ?"

ఆతరువాత అతను ఫ్యాక్టరీకి వెళ్ళి సాయంత్రం 6 గంటలకు వచ్చాడు. అతను ఆవరణలో అడుగుపెట్టే సరికి మాలతి తోటలోకి పోతోంది. అతను ఆమెను అనుసరించాడు.

"అంత తొందరగా పరుగుతీస్తే మళ్ళీ పడతావ్. ఈ సారి మాత్రం లేవదీయను సుమా !" అంటూ నవ్వాడు.

"పో బావ."

"పోయిన వాణ్ణిగా లాక్కొచ్చావ్ !"

"నేలాక్కొచ్చానా."

"కాదామరి ?"

"కాదు. ప్రేమసంబంధం." అంటూ అతన్ని సమీపించింది.

"కాదు, నే చెప్పనా ?" అంటూ ఆమె చుబుకాన్ని పైకెత్తి ఆమె కళ్ళల్లోకి చూస్తూ,

"చెప్పనా ?"

"వూఁ."

"రక్తసంబంధం."

